





# ధర్మము

## విచారణ

## పురాణ నీతి కథలు- 1,4





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015310,2020050015474



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

“దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం” అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని జళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన ‘ఇచ్ఛ’ (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. “నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది” అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పురాణ నీతి కథలు

## (మొదటి భాగము)

గ్రంథకర్త :

[illegible]

[illegible] ముద్రణాలయము, తెనాలి.

[illegible]

[ వెల రు 0-3-0

# పీ ఠి క

—:o:—

బాల, బాలికలను సన్మార్గ ప్రవర్తనులగు నట్లొనర్పుటకు కేవలము నీతి వాక్యములను బోధించుట కంటె వానిని కథారూపముల బోధించుట మేలని యనేకుల యభిప్రాయము. పిల్లలకు గథలు వినుట యందుత్సాహము మెండు. నీతికథలు మన పురాణేతిహాసాదుల యందు మిక్కుటము. అట్టి వానిని నేర్పినచో బాల, బాలికలకు అర్యధర్మములతో బాటు నైతిక జీవన మలవడునను తలంపుతో పురాణ గ్రంథముల నుండి నీతి కథలను సేకరించి యీచిన్ని పొత్తమును సమకూర్చితిని.

ప్రాథమిక పాఠశాలల బాల, బాలికలకు ఈగ్రంథ ముపయోగ పడగలదని ఆశించుచున్నాడ.

నందివెలుగు. 15-11-29 } ఇట్లు గ్రంథకర్త

# విషయసూచిక



శ్రీ ర స్తు.

# పురాణనీతికథలు



## 1 దేవుని యందు భక్తి ఉంచుము

—:o:—

పూర్వము ఉత్తానపాదుడు అను రాజు గలడు. అతనికి సురుచి, సునీతి అను ఇద్దరు భార్యలు. సురుచికి ధృవుడు, సునీతికి ఉత్తముడు అను కుమాళ్ళు ఉండిరి. రాజునకు చిన్న భార్య అగు సునీతి యందును ఆమె కుమారుడగు ఉత్తముని యందును ఎక్కువ ప్రేమ.

ఒకనాడు రాజు ఉత్తముని తొడమీద కూర్చుండ బెట్టుకొని ముద్దులాడుచుండెను. ధృవుడు అది చూచి తాను కూడ తండ్రి తొడ యెక్కుటకు వేడుకపడెను. సునీతి ధృవుని ఈవలకు లాగివైచి "ఓరీ! నీ తండ్రి తొడమీద కూర్చుండుటకు తగవు, అట్లు కోరిక గలదేని భగవంతుని ఆశ్రయించి నాకడుపున పుట్టుము" అని నిందించెను.

ధృవునకు చాల విచారము గలిగెను. భగవంతుని ప్రార్థించి తన కోరిక నెఱవేర్చుకొనుటకు అతడు నిశ్చయించెను. అందులకు ఎవరును ఉండని అరణ్యమునకు వెళ్ళుటకు

తల్లి అనుమతి పొందెను. అంతట ధృవుడు ఒక అరణ్యమునకు వెళ్ళెను. బాలుడైనను భయపడలేదు. అతని మనస్సు భగవంతునియందే ఉండెను. నిద్రాహారములు లేక చాలకాలము భగవంతుని ప్రార్థించెను.

తుదకు అతని భక్తికి మెచ్చి భగవంతుడు అగుపడెను. అతడు కోరిన వరముల ఇచ్చెను. తరువాత ధృవుడు ఇంటికి వెళ్లెను. సవతితల్లియును తండ్రియును అతనిని గౌరవించిరి. అతని తల్లి చాల సంతోషించెను.

తండ్రి అనంతరము ధృవుడు చాల కాలము రాజ్యము చేసి భగవంతుని దయచే శాశ్వత కీర్తిని పొందెను. చూచితిరా! ధృవుని భక్తి.

.:o:.

## 2 తండ్రి మాట జవదాటరాదు

.:o:.

దశరథుడు అయోధ్యాపట్టణపు రాజు. అతనికి కౌసల్య, సుమిత్ర, కైక అను ముగ్గురు భార్యలు. కౌసల్యకు రాముడు సుమిత్రకు లక్ష్మణుడు, శత్రుఘ్నుడు, కైకకు భరతుడు అను కుమాళ్ళు గలరు. ఒకప్పుడు దశరథుడు కైకకు తనయిష్టము వచ్చినప్పుడు కోరుకొనునట్లు రెండు వరములు ఇచ్చెను.

దశరథుడు పెద్దవాడయ్యెను. పెద్దకుమారుడగు రాముని రాజుగా చేయుతలచెను. ఆసమయమున క దశర

ఘుని వద్దకు వెళ్లి తనకు రాజు యిచ్చి ఉండిన రెండువరములను అడిగెను. అందు మొదటిది రాముని పదునాలుగుసంవత్సరములు అరణ్యమునకు పంపుమనియు రెండవది తన కుమారుడగు భరతుని రాజుగా చేయుమనియు కోరెను.

దశరథునకు రామునియందు మిగులప్రేమ. రాముని విడచి ఉండలేనని దశరథుడు కైకను ప్రాతిమాలెను. ఆమె వినలేదు. సత్యమునకు లోబడి దశరథుడు ఈమాటను రామునకు చెప్పెను. రాముడు దిగులుపడలేదు. తన తండ్రిమాట ప్రకారము నడచుటయే అతనికి సంతోషముగ ఉండెను. వెంటనే రాముడు తమ్ముడగు లక్ష్మణుడును భార్యయగు సీతయును వెంబడింప అరణ్యమునకు వెళ్ళెను.

అరణ్యములో రాముడు చాల బాధలు పడెను. భార్యయగు సీతను రాక్షసులు ఎత్తుకొనిపోయిరి. తుదకు సుగ్రీవుడు అను వాని సహాయముతో రాక్షసుల చంపి భార్యను తెచ్చెను. ఇంతలో పదునాలుగు సంవత్సరములు ముగిసెను. అంతట అయోధ్యకు వెళ్లి రాజయ్యెను.

తండ్రిమాట నెరవేర్చుటకు ఎంతకష్టమైనను వెనుదీయరాదు.

—:o:—

# 3 గురుభక్తి ఉంచవలయును

ఏకలవ్యుడు ఒక ఎఱుకవాని కొడుకు. వానికి విలువిద్య నేర్చుకొన బుద్ధి కలిగెను. ద్రోణుడు అను బ్రాహ్మణుని తనకు విలువిద్య నేర్పవలసినదిగా ప్రార్థించెను.

క్షత్రియ బాలురకు తప్ప ఇతరులకు విలువిద్య నేర్పనని ద్రోణునకు ఒక నియమము ఉండెను. అందువలన ఏకలవ్యుని ప్రార్థన ఒప్పుకొనలేదు. అంతట ఏకలవ్యుడు ఒక అరణ్యమునకు వెళ్ళెను. అచ్చట ఒక చిన్న ఇంటిలో ద్రోణుని బొమ్మ ఉంచెను. ఆ బొమ్మను తన గురువుగా భావించి విలువిద్య నేర్చుకొనుచుండెను.

కొన్ని దినములకు ద్రోణుడు ఏదో పనిమీద ఆ అడవికి వెళ్లెను. ఏకలవ్యుడు అతనిని పూజించెను. ద్రోణునికి ఆశ్చర్యము కలిగి ఏకలవ్యుని గురుభక్తి పరీక్ష చేయదలచెను. గురుదక్షిణగా తనకు ఏకలవ్యుని బొటనవ్రేలు కోసి ఇమ్మని అడిగెను.

ఏకలవ్యుడు కొంచమైనను విచారించలేదు. వెంటనే తన బొటనవ్రేలు కోసి గురువు ముందు ఉంచెను. ద్రోణుడు అతని గురుభక్తికి చాల మెచ్చెను. ఏకలవ్యుని దీవించి తన మహిమవలన అతనికి బాధలేకుండ చేసెను.

గురుభక్తిగల వారికి మేలు కలుగును.

# 4 అబద్ధము చెప్పకూడదు.

దేవేంద్రుడు స్వర్గలోకమునకు రాజు. ఒకప్పుడు అతని సభయందు ఎన్నడును అబద్ధము చెప్పనివాడు ఎచ్చటనైన గలడా? అను ప్రశ్న వచ్చెను. వసిష్ఠుడు అను ముని లేచి "భూలోకమున హరిశ్చంద్రుడు అట్టివాడు" అని చెప్పెను. ఆమాటలకు విశ్వామిత్రఋషికి కోపము వచ్చెను. తాను హరిశ్చంద్రుని అబద్ధమాడింతునని పంతము వేసెను.

విశ్వామిత్రుడు హరిశ్చంద్రునకు చాలబాధలు కలుగ చేసెను. అతని రాజ్యమును హరించి అడవులకు పంపెను. హరిశ్చంద్రుడు మునికి కొంత బాకీ ఉండెను. బాకీ రాబట్టు కొనుటకు విశ్వామిత్రుడు రాజుభార్యయగు చంద్రమతిని కొమారుడగు లోహితాస్యుని అమ్మివేసెను. హరిశ్చంద్రుని కూడ ఒకమాలవానికి అమ్మెను. ఇంకను విశ్వామిత్రుడు తన మాయచేత లోహితాస్యుని చంపించెను. ఆపట్టణపు రాజ కుమారుని చంపినది చంద్రమతియే అని రాజునకు అబద్ధములు చెప్పెను. రాజు చంద్రమతి తల నఱుకుమని హరిశ్చంద్రుని వద్దకు పంపెను.

హరిశ్చంద్రుడు జంకక భార్యను నఱుక సిద్ధమయ్యెను. అప్పుడు విశ్వామిత్రుడువచ్చి హరిశ్చంద్రుని ఒక అబద్ధము చెప్పుమని కోరెను. అట్లుచేసిన కుమారుని భార్యను బ్రతికిం

చెదను." అని చెప్పెను. హరిశ్చంద్రుడు ఒప్పుకొనక చంద్రమతిని నఱుకబోయెను.

విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని ఆపి అతని సత్యవ్రతమునకు చాలమెచ్చుకొనెను. తన శక్తివలన లోహితాస్యుని రాజకుమారుని బ్రతికించెను. హరిశ్చంద్రునకు చాలవరముల ఇచ్చి మరల రాజ్యమునుకూడ ఇచ్చివేసెను.



## 5 పెద్దలను ఎగతాళి చేయరాదు.

శ్రీకృష్ణుడు మహాత్ముడు. అతడు యాదవ వంశమునకు చెందినవాడు. ద్వారకాపట్టణమునకు రాజు. ఒకప్పుడు కొందరు ఋషులు అతనిని చూచుటకు ద్వారకకు వచ్చిరి.

కొందరు యాదవులు వారిలో ఒకనికి స్త్రీవేషము వేసిరి. ఆమెను ఋషులకు చూపి "స్వామీ! ఈమెకు మూడు నెలల కడుపు. ఏపిల్లపుట్టునో దయచేసి చెప్పుడు." అని ప్రార్థించిరి.

ఋషులు వారల మోసము తెలిసికొనిరి. కొంచెము కోపముతో "ఆమెకు ఒక ఇనుపదూలము పుట్టును. అని చెప్పిరి. నిజముగా కొన్నిదినములకు ఆస్త్రీవేషము వేసినవాని

కడుపున ఒక పెద్ద ఇనుప రోకలము పుట్టినది. పెద్దలను ఎగతాళిచేసిన ఫలితము.

---

## 6 దొంగతనము చేయరాదు

శంఖుడు, లిఖితుడు అను ఇద్దరు అన్నదమ్ములు ఉండిరి. వారిద్దరు వేర్వేరు చోటుల కాపురముండిరి. శంఖుడు తన తోటలో ఒక మామిడిచెట్టు పెంచుచుండెను. ఆచెట్టున పండ్లు చక్కగా పండియుండెను. శంఖుడు ఆపండ్లనుకోసి తినక దేవునికి ఇవ్వదలచి కోయలేదు.

ఒకనాడు లిఖితుడు అన్న ఇంటికివెళ్ళెను. శంఖుడు ఎక్కడకో వెళ్ళియుండెను. లిఖితుడు మామిడిపండ్లనుచూచి వాటిని తినవలయునని తలచెను. అతడు తన అన్న ఉద్దేశము ఎరుగడు. ఈపండ్లు అన్నిటిని నాఅన్న ఒక్కడు తినగలడా? అని ఆలోచించి కొన్నిటిని కోసి తినుచుండెను.

ఇంతలో శంఖుడు వచ్చెను. అతడు తమ్మునిచూచి "లిఖితా! ఇతరుల సొమ్మును వారి అనుమతిలేక తీసుకొనుట దొంగతనము అనబడును. అందువలన చాలపాపము వచ్చును. నీవురాజువద్దకువెళ్ళి శిక్షనుపొందుము. అట్లుచేసితివేని పాపము పోవును" అనిచెప్పెను. లిఖితుడు రాజువద్దకువెళ్ళి తన దొంగతనమునకు శిక్షింపుమని కోరెను. రాజు అతనికి కాలుచేతులు నఱికించెను. కావున దొంగతనము చేయరాదు.

# 7 జూదమాడరాదు

పూర్వము నలుడు అను రాజు నిషధదేశమును పాలించుచుండెను. ఆరాజు విద్యయందును పరాక్రమమందును చాల గొప్పవాడు. అతని రాజ్యమందు ప్రజలు సుఖముగా ఉండిరి. అతనికి జూదమాడుటయందు మిగుల ప్రేమ. దమయంతి అను కన్య దేవతలనుకూడ పెండ్లి ఆడక అతనిని వరించి పెండ్లాడెను.

నలునకు పినతండ్రి కొమారుడు పుష్కరుడు అనువాడు గలడు. వాడు నలుని గొప్పతనమునకు ఓర్వలేక అతనిని పరాభవించి రాజ్యమును పొందుటకు ఉపాయములు వెదకుచుండెను. తమను వివాహము చేసుకొనలేదని దమయంతిపై దేవతలు కోపముతో ఉండిరి. వారు నలుని కష్టములపాలు చేయుమని పుష్కరుని ప్రోత్సహించిరి. ఒకనాడు పుష్కరుడు నలుని జూదమాడుటకు రమ్మని పిలిచెను. నలుడును పుష్కరుడును జూదమాడుటకు ఆరంభించిరి. జూదమాడుట అపాయకరమని ఎవరు చెప్పినను నలుడు వినలేదు. తుదకు జూదములో తన రాజ్యము సంపదయు యావత్తును ఓడిపోయెను.

అటుపిమ్మట నలుడు భార్యతో అడవుల పాలయ్యెను. తినుటకు అన్నముగాని త్రాగుటకు నీరుగానిలేక అడవులలో తిరిగి తిరిగి ఎన్నో బాధలుపడెను. కావున వినోదమునకైనను జూదమాడరాదు.



# 8 కోపము కీడుతెచ్చును

అంబరీషుడు అనురాజు చాల దైవభక్తుడు. ఒకప్పుడు అతడు భగవంతుని గురించిన ఏకాదశీవ్రతమును ఆరంభించెను. ఆవ్రతము చివర దినమున అతడు బ్రాహ్మణుల పూజచేసి మధ్యాహ్నవేళకు భోజనమునకు కూర్చుండెను. ఆసమయమున దూర్వాసుడు అను మునివచ్చెను. రాజు మునికి మర్యాదలు చేసి భోజనము చేయుమని వేడెను.

ముని సమ్మతించి స్నానమునకు నదికి వెళ్లెను. రాజునకు భోజనము చేయవలసినవేళ అతిక్రమించి పోవుచుండెను. ఆవేళకు భోజనము చేయనియెడల పాపమువచ్చును. మునికొరకు ఎంతచూచినను వచ్చుజాడలు కన్పించలేదు. రాజు, వ్రతమునకు భంగములేకుండ నీళ్ళుత్రాగెను. ఇంతలో ముని వచ్చెను. తననువదలి రాజు భుజించెనని చాలకోపమువచ్చెను. తన తపోబలముచే ఒకశక్తినిచేసి రాజును శిక్షించుటకు పంపెను.

భగవంతుడు తనభక్తునికి అపాయము కలుగుటచూచి తనచక్రమును పంపెను. ఆచక్రము శక్తినిచంపి కోపిష్ఠియగు మునినికూడ చంపబోయెను. అప్పుడు ముని ఏమియుచేయలేక తుదకు రాజునే శరణువేడి ప్రాణములు కాపాడుకొనెను.

—:o:—

# 9 జీవహింస చేయరాదు

మాండవ్యుడు అను మునిగలడు. ఒక అడవిలో భగవంతుని గురించి తపస్సు చేయుచుండెను. ఒకనాడు దాపున నున్న పట్టణపురాజు ఇంటిలో కొందరు దొంగలు నగలను దొంగిలించిరి. వారు మాండవ్యుడు తపస్సు చేసుకొనుచున్న అడవిన పారిపోవుచుండిరి.

రాజభటులు దొంగలను వెంబడించిరి. దొంగలు భయముచే నగలను మునివద్ద పడవేసి పరుగెత్తిరి. తపస్సు చేసుకొనుచున్న ముని అది చూడలేదు. రక్షకభటులు వెదకుచు వచ్చి నగలను మునివద్ద చూచిరి. "నగలను దొంగిలించి పారిపోవలేక దొంగతపస్సు చేయుచున్నాడు. ఇతడే దొంగ" అని మునిని బంధించి రాజువద్దకు తీసుకవెళ్ళిరి. రాజు ఆలోచన చేయక మునికి కొఱత శిక్ష వేయించెను.

కొన్నిదినములకు మాండవ్యుడు దొంగకాదని రాజునకు నిజము తెలిసెను. మునిని వదలి క్షమాపణ వేడెను. అందులకు ముని రాజా! నీతప్పు ఏమియును లేదు. నేను చిన్నతనమున తూనీగలను పట్టుకొని ముల్లునకు గ్రుచ్చి ఆడితిని. అందువలన నేను ఈశిక్ష అనుభవించ వలసివచ్చినది." అని చెప్పి తన త్రోవన వెళ్ళెను.

తెలిసియైనను తెలియకయైనను జీవహింస చేయరాదు.

—:o:—

# 10 పలువురతో పగకూడదు

పాండవులలో మధ్యవాడైన అర్జునునకు అభిమన్యుడు అనుకొడుకు ఉండెను. అతడు మిక్కిలి బలమును ధైర్యమును గలవాడు. ఒకనాడు తన తండ్రిలేని సమయమున అతడు శత్రువులతో యుద్ధము చేయవలసివచ్చెను.

యుద్ధములో ద్రోణాచార్యులు పద్మవ్యూహము అను పద్ధతిప్రకారము సైన్యము నడపుచుండెను. అభిమన్యుడు ఆ మొగ్గరము చొచ్చుటతప్ప మరలవచ్చుట ఎరుగడు. అయినను బలముగలవాడనను ధైర్యముతో యుద్ధముచేయుచుండెను. వాని యుద్ధము బహు భయంకరముగ ఉండెను. వానిచేత దెబ్బ తిననివాడు ఒక్కడైనను లేడు.

ఇట్లు యుద్ధము చేయుచుండగా పగవారందరు ఒక్కసారి వానిపైబడిరి. ఒకడు గుఱ్ఱములను చంపెను. ఒకడు రథమును విఱుగగొట్టెను. మఱియొకడు తల నఱికెను. ఇట్లు అందరును ఏకమై అభిమన్యుని చంపిరి. ఎంతబలవంతుడైనను అభిమన్యుడు పలువురు కలసినప్పుడు ఏమియును చేయలేక చనిపోయెను.

క॥ బలవంతుడ నాకేమని
పలువురతో నిగ్రహించి ♦ పలుకుట మేలా
బలవంతమైన సర్పము
చలిచీమలచేతజిక్కి ♦ చావదె సుమతీ.

# 11 స్నేహము మరువరాదు!

శ్రీకృష్ణుడును కుచేలుడు అను బ్రాహ్మణుడును చిన్నతనమున సాందీపుడు అను గురువువద్ద విద్యనేర్చిరి. వారు చదువుకొనునప్పుడు మిగుల స్నేహముగ ఉండిరి. విద్య నేర్చిన పిమ్మట ఎవరి గ్రామములకు వారు వెళ్లిరి. శ్రీకృష్ణుడు ద్వారకా పట్టణమునకు ప్రభువై ఎనిమిదిమంది భార్యల వివాహమాడి సకల సౌఖ్యములు అనుభవించుచుండెను. కుచేలుడును తనముని పల్లెకు వెళ్లి వివాహమాడెను. కుచేలునికి ఇరువదియేడుగురు బిడ్డలు కలిగిరి. అతడు దరిద్రుడు. భగవంతుని ధ్యానించుచు ఎవరిని యాచింపక కుటుంబము గడపుచుండెను.

కుచేలుని సంసారము నానాటికి దరిద్రస్థితికి వచ్చెను. పిల్లలు తల్లిని అదిపెట్టుము, ఇదిపెట్టుము అని ఏడిపించుచుండిరి. ఒక్కనాడు ఆమె కుచేలునితో "నాథా! బిడ్డలు అన్నములేక మలమల మాడుచున్నారు. నేను వారి మొఱ వినలేకున్నాను. తమకు శ్రీకృష్ణమూర్తి బాల్యస్నేహితుడని వినియున్నాను. అతడు మహానుభావుడు. అతనిని ఆశ్రయించి ఏమైన అడిగి తెచ్చి పిల్లలను కాపాడుడు" అని ప్రార్థించెను. కుచేలుడు ఆమాటలువిని బాల్యస్నేహితుడగు కృష్ణుని చూచుట మంచిదని తలచెను. ప్రభువువద్దకు వెళ్ళునప్పుడు ఏమైన కానుక తీసుకు వెళ్ళవలెను. అందులకు ఏమైనఉన్నదా అని భార్యను అడిగెను. అప్పుడామె గుప్పెడు అటుకులను అతని కొంగున మూటగట్టెను. కుచేలుడు బయలుదేరి కొన్నిదినములకు ద్వారకా

పట్టణము చేరెను. అక్కడ అనేకమంది రాజులు శ్రీకృష్ణుని చూచుటకు వీలులేక వాకిలివద్ద కాచుకొనియుండిరి. కుచేలుడుకూడ వాకిలివద్దకు వెళ్లెను. కావలివారలు అతనిరాకను కృష్ణునకు తెలిపిరి.

కృష్ణుడు వెంటనేవచ్చి కుచేలుని కౌగలించుకొని లోపలకు తీసుకవెళ్ళెను. అతనిని తనసింహాసనమునకూర్చుండబెట్టి కాళ్ళు కడిగెను. పిమ్మట తన పాన్పుమీద పరుండబెట్టి భార్యలును, తానును కాళ్ళుపిసికిరి. శ్రీకృష్ణుని దర్శనము చిక్కక వాకిలివద్ద కాచుకొనియున్న రాజాధిరాజులును, అచ్చటి సేవకులును, బీదబ్రాహ్మణుడగు కుచేలుడు పొందిన గౌరవమునకు ఆశ్చర్యమొందిరి. కృష్ణుడును కుచేలుడును తాము చదువుకొనునప్పుడు చేసిన పనులను చెప్పుకొనుచు కాలము గడపిరి. కృష్ణుడు కుచేలునిచూచి "మిత్రమా! నాకేమి తెచ్చితివి" అని అడుగ కుచేలుడు అటుకులమూట ఇచ్చెను. కృష్ణుడు ప్రీతితో గుప్పెడు అటుకులను భుజించెను. ఆనాడు కుచేలుడు సిగ్గుచే తానువచ్చిన ఉద్దేశము చెప్పకుండగనే కృష్ణునివద్ద సెలవుపొంది ఇంటికివెళ్ళెను.

కుచేలుడు వెళ్ళునప్పటికి అతని ఇల్లంతయు బంగారుమయమై, ధనధాన్యములతో నిండియుండెను. తనకు అట్టి భాగ్యము కలుగజేసినది భగవంతుడగు శ్రీకృష్ణుడేయని కుచేలుడు యెరింగి అతనిని మఱువక తనజీవితకాలమంతయు ఆతనిని ధ్యానించుచుండే గడపి మోక్షమును పొందెను.

# 12 గర్వము కూడదు

పూర్వకాలమున నహుషుడు అను చక్రవర్తి గలడు. అతడు ఈభూమండలము నంతయు రాజ్యముచేసెను. అతడు గర్వించి దేవలోకమును కూడ రాజ్యముచేయ దలచెను. అందుకు నూరు యజ్ఞములు చేసెను. పిమ్మట దేవలోకమునకు కూడ రాజయ్యెను.

అతడు అధికార గర్వముచే అనేక దుండగములు చేయ నారంభించెను. పుణ్యులగు మునులను తనపల్లకిని ప్రతిదినము మోయునట్లు ఆజ్ఞాపించెను. ఇట్లుండ ఒకనాడు అతని వద్దకు అగస్త్యుడు అను ఒక గొప్ప మునీశ్వరుడు వచ్చెను. నహుషుడు అతని కొక త్రాడుచూపి "పాము పాము" అని భయపెట్టెను. ఆమాటలకు మునీశ్వరుడు కోపించి "నీవు ఒక పెద్ద పాముగా భూలోకమున పుట్టుదువుగాక" అని శాపమిచ్చెను.

తన గర్వముచేత అట్టి శాపము కలిగెనని తెలివిదెచ్చుకొని నహుషుడు మునీశ్వరుని కాళ్లమీద పడి రక్షింపుమని వేడెను. ముని కనికరించి ఇట్లనెను "రాజా! నీవు దుఃఖించి నందువలన ప్రయోజనము లేదు. నీ గర్వమే నిన్నిట్లు చేసినది. నేనుశాపము త్రిప్పజాలను. కాని ఒకఉపకారము చేసెదను. నీవు పాముగా ఉండినను మనుష్యుని వలె మాట్లాడగల శక్తి ఉండును. భూలోకమున నీవు పామువై యున్నప్పుడు పాండవు

లలో పెద్దవాడగు ధర్మరాజు వలన నీశాపము పోగొట్టుకొన గలవు అని చెప్పెను.

అంతట నహుషుడు భూమిమీద ఒక పెద్ద పాముగాపుట్టి ఒక అడవిలో తిరుగుచుండెను. ఒకనాడు పాండవులలో రెండవ వాడగు భీముడుఅచ్చటకు వచ్చెను. పాము భీమునిపట్టుకొనెను. భీముడు బలముగలవాడైనను పామునకు చిక్కి తప్పించుకొన లేకపోయెను. ఎంతసేపటికి భీముడు రానందున ధర్మరాజు వెదకుచు పామువద్దకు వచ్చెను. ధర్మరాజు బలవంతుడైన తన తమ్ముడు ఒకపాముచేత బాధింపబడినందులకు ఆశ్చర్యమొందెను. పామును సమీపించి అతని సంగతి అడిగెను.

పాముగానున్న నహుషుడు తనసంగతి యావత్తును ధర్మరాజునకు వినిపించెను. ధర్మరాజుదయవలన భీముని విడచి తన శాపము పోగొట్టుకొని నహుషుడు తిరిగి పుణ్యలోకమును పొందెను.

ఆ. అల్పుడైనవాని క ♦ ధిక భాగ్యముగల్గ
దొడ్డవారిదిట్టి ♦ తొలగొట్టు
అల్పజాతి మొప్పె ♦ యధికుల నెఱుగునా
విశ్వదాభిరామ ♦ వినురవేమ.

—:o:—

# 13 దురాశ కూడదు

ధృతరాష్ట్రుడును పాండురాజును అన్నదమ్ములు. ధృతరాష్ట్రునికి దుర్యోధనుడు మొదలుగాగల నూరుగురు కుమారులును పాండురాజునకు ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు అను అయిదుగురు కుమారులునుగలరు. ధృతరాష్ట్రసంతతికి కౌరవులనియు పాండురాజు సంతతికి పాండవులనియు పేర్లు. పాండవుల తండ్రి చిన్నతనముననే చనిపోయెను. అందువలన వారు పెత్తండ్రి పోషణలో ఉండిరి.

దుర్యోధనుడు దురాశచే పాండవులకు రాజ్యములో భాగములేకుండ చేసి యావత్తురాజ్యమును తానే ఏలవలెనని నిశ్చయించుకొనెను. పాండవులను చంపించుటకు అతడు అనేక ప్రయత్నములు చేసెను. వారికి విషము పెట్టించెను. సముద్రములో త్రోయించెను. ఎన్నిచేసినను వారు చావరైరి. పిమ్మట దుర్యోధనుడు కాశీలో ఒక లక్కయిల్లు కట్టించెను. తండ్రితో చెప్పి పాండవులు అందు కాపురముండునట్లు చేయించెను. పాండవులు లక్కయింటిలో కాపురముండిరి. ఒక రాత్రి వారు నిద్రించుచుండగా ఆ ఇంటికి నిప్పు ముట్టించెను. పాండవులు ఎటులనో బ్రతికి అడవుల పాలైరి.

తర్వాత పెద్దలు చివాట్లువేయగా ధృతరాష్ట్రుడు పాండవుల పిలిపించి వారి సగము పాలురాజ్యమిచ్చెను. తన కొడుకులతో సంబంధములేకుండ ఇంద్రప్రస్థపురమున రాజ్యము

చేసుకొనునట్లు ఏర్పాటుచేసెను. కాని పాండవుల రాజ్యమును హరించవలెనను దురాశ దుర్యోధనునకు హెచ్చెను. పాండవులను తనతో జూదమాడుటకు పిలిపించెను. అది మాయాజూదమని తెలియక ధర్మరాజు జూదమాడెను. ఆ జూదములో ధర్మరాజు ఓడెను. అందువలన పాండవులు పన్నెండు సంవత్సరములు రాజ్యమును దుర్యోధనునకు వప్పగించి అడవిలో ఉండవలసినచ్చెను.

దుర్యోధనుడు సంతోషముతో పాండవుల రాజ్యమును కూడ తానేపాలించుచు పన్నెండు సంవత్సరముల కాలములో పాండవులు అడవిలో చనిపోయెదరని తలచెను. కాని పాండవులు పన్నెండు సంవత్సరములు వనవాసముచేసి హస్తినాపురమునకువచ్చిరి. తమరాజ్యము తమకిమ్మని దుర్యోధను నడిగిరి. దుర్యోధనుడు రాజ్యమివ్వక వారలతో యుద్ధము చేసెను.

పాండవులు మంచిగుణములు గలవారు. ధర్మాత్ములు. దేవుని సహాయము గలవారు. శౌర్యవంతులు. యుద్ధములో దుర్యోధనుడు తన బంధువులతో మరణించెను. దురాశవలన రాజ్యమును పోగొట్టుకొనుటయేగాక తనబంధువులతోసహా దుర్యోధనుడు మరణించెను.

ఆ॥ నీళ్ళలోని మీను నెఱిమాంస మాశించి
గాలమందుజిక్కు కరణి భువిని
ఆశ దగిలి నరుడు నాలాగ చెడిపోవు
విశ్వదాభిరామ వినుర వేమ

# 14 డంబము (బడాయి) పనికిరాదు.

ఉత్తరుడు అను రాజకుమారుడు గలడు. ప్రతిదానికిని తానే మొనగాడనని డంబములు పలుకువాడు. ఒకనాడు అతని తండ్రిలేని సమయమున దుర్యోధనుడు సైన్యముతో వచ్చి పొలములో ఉన్న ఆవులను తోలుకుపోవుచుండెను.

ఈవార్త రాణివాసములోని స్త్రీలు, విని రాజుగారు లేకపోయిరి అని విచారపడుచుండిరి. అది ఉత్తరుడు విని స్త్రీలతో మన ఆవులను దుర్యోధనుడు తోలుకువెళ్ళుట యేమి! నేనుండుట మఱచినాడు కాబోలు! ఈసమయమున నారథము నడపుటకు సారథియుండెనేని దుర్యోధనుని గర్వము నిమిషములో అణగద్రొక్కుదును. భూమండలమంతటిలో ప్రసిద్ధికెక్కిన అర్జునుడుసైతము వణకునట్లు యుద్ధము చేయుదును. నన్ను యెదిరించి యుద్ధముచేయగల వాడెవడున్నాడు? నేను యుద్ధమునకు బయలుదేరినవార్త విన్నంతనే దుర్యోధనుడు పారిపోవవలసినదేగదా! అని డంబములు పలుకుచుండెను.

దుర్యోధనుని విరోధులును, పినతండ్రి కుమారులును అగు పాండవులు మాఱువేషములతో ఉత్తరుని తండ్రికొలువులో ఉద్యోగులుగ ఉండిరి. వారిలో అర్జునుడు బృహన్నల అనుపేరుతో పేడిమాతివాని వేషముధరించియుండెను. ఆ బృహన్నల ఉత్తరుని డంబములను వినెను. తాను సారథిగనుండి రథము నడిపెదనని ఉత్తరునితో చెప్పెను. ఉత్తరుడా పేడి

మూతివానిని సారథిగా జేయుటకు యిష్టపడలేదు. కాని యెవరును లేనందున అతనినే సారథిగా జేసి రథమెక్కి యుద్ధమునకు వెళ్ళెను.

యుద్ధభూమిలో విరోధిసైన్యము సముద్రమువలెనుండెను. ఉత్తరు డది చూచి భయమొంది పారిపోవజొచ్చెను. బృహన్నల వానిని జూచి "ఉత్తరుడా! నీడంబములు ఆడువాండ్రవద్దనేనా! అని నవ్వుచూ వానిని రథము తోలుమనియు తాను విరోధులను ఓడించెదననియు చెప్పెను. కాని ఉత్తరుడు తాను నిలువజాలనని పారిపోపజూచెను. అర్జునుడు అతనిని బలవంతముగ సారథిగ జేసి తాను యుద్ధము చేయసాగెను. శత్రువుల నందర ఓడించెను. తరువాత ఆవులను మరలించుకొని వచ్చిరి.

"ఆ. మేడిపండుజూడ ♦ మేలిమైయుండును
బొట్టవిచ్చిచూడ ♦ పురుగులుండు
బెఱుకువాని మదిని ♦ బింకమీలాగురా
విశ్వదాభిరామ ♦ వినురవేమ.

—:(o):—

# 15 తనుఁదాను పొగడు కొనరాదు.

పూర్వము యయాతి అను రాజుగలడు. అతడు అనేక ధర్మములను, యజ్ఞములను చేసెను. అతడు చిరకాలము రాజ్యముచేసి ముసలితనమున కుమారుడైన పూరునకు రాజ్యము వప్పగించి తా నడవికి తపస్సునకు వెళ్ళెను. అచట అతడు కాయకూరల దినుచు క్రమముగా భగవంతుని గూర్చి ఘోరతపస్సు చేసెను. పిమ్మట అతడు దేవలోకమునకు వెళ్ళి దేవతలు తన్ను సేవించుచుండ వైభవముతో ఉండెను. ఇట్లు బహుకాలము గడచెను.

ఒకనాడు దేవేంద్రుడు ఒక సభ చేసెను. ఆసభయందు యయాతికూడ నుండెను. దేవేంద్రుడు సభికులనుజూచి "ఈ మూడు లోకములందును ఎక్కువ పుణ్యము చేసినవారు ఎవరు" అని ప్రశ్నించెను. ఆప్రశ్నకు జవాబుచెప్పలేక మునీంద్రులందరును ఊరకుండిరి. అంతట యయాతిలేచి ఇంద్రునితో ఇట్లు అనెను.

"దేవేంద్రా! భూలోకము యావత్తును రాజ్యముచేసితిని. భయమునొందుట, రహస్యముగ నితరుల కపకారము ఒనరించుట, కోపముగలిగియుండుట, కపటముతోనుండుట అనునవి నేను ఎఱుగను. మఱియు తల్లిదండ్రులను, గురువులను, పెద్దలను, మునులను నేను ఎన్నడును అవమానించియుండలేదు. ఎవరినిగాని కఠినపుమాటలచే, తూలనాడలేదు. అనేక దాన

ధర్మములను యాగములను చేసితిని. ఇంకను దేవతలయందు గాని, మానవులయందుగాని, మునులయందుగాని తపమున నాకు సాటియగువాడు లేడు. అందువలననే, నాకీ స్వర్గ లోకము లభించినది' అని తనుదాను పొగడుకొనెను.

ఇంద్రుడా మాటలకు కోపించి "రాజా! నీవు నిజముగా అనేక పుణ్యములను చేసియుందువుగాక! తనుదాను బొగడు కొనుట ఎట్టివారికిని తగదు. నీకు సమానులైనవారిని, నీకంటె అధికులైనవారిని, తక్కువైనవారిని, తెలిసికొనకయే యందఱి నవమానపఱచితివి. కనుక, నేటితో నీవు చేసిన పుణ్యమం తయు నశించినది. నీయట్టి గర్వమున్నవాడు ఇచ్చట ఉండ దగడు. నీవిప్పుడే ఈస్వర్గలోకమునుండి దిగబడగలవు" అనెను.

అప్పుడు యయాతి దుఃఖముతో తాను భూలోకమున సజ్జనుల నడుమపుట్టునట్లు సేయుమని దేవేంద్రుని వేడెను. ఇక నైనను "నిన్ను నీవు పొగడుకొనకుము" అని చెప్పి దేవేం ద్రుడు అతడు వేడినట్లుచేసెను. కనుక తనుఁదాను బొగడు కొనుట, ఇతరుల దూషించుట పనికిరాదు.

"ఆ. నేరనన్నవాడు నెఱజాణ మహిలోన
నేర్తునన్నవాడు నిందఁజెందు
ఊరకున్నవాడె యుత్తమయోగిరా
విశ్వదాభిరామ వినురవేమా."

---

# 16 ఆలోచించి పనిచేసిన హానిగాదు.

పూర్వము ఒక ముని గలడు. అతనికి చిరకారి అను ఒక కుమారుడు గలడు. చిరకారి అనగా ఆలోచనచేయు వాడు అని అర్థము. అతడు ఏపని చేసినను ఆలోచించిచేయు వాడు. అందువలన ఆపేరు కలిగెను. ఒకనాడుఏదో ఒక కారణ మున ముని, భార్యపై కోపించి "నీతల్లిని చంపుము" అని కుమారునకు ఆజ్ఞయిచ్చి తాను పుష్పముల కొరకు, అడవికి వెళ్ళెను. ఎన్నడును తొందరపడుగని చిరకారి అపుడిట్లు ఆలోచించసాగెను.

"ఈసమయమున తండ్రి ఆజ్ఞ మీరరాదు. తల్లిని చంపు టయు తగదు. తల్లియు దండ్రియు నాకు సమానులె అగుదురు. కాని తండ్రియే కుమారుని రూపమున పుట్టునని శాస్త్రములు చెప్పుచున్నవి. మరియు తండ్రి ఆజ్ఞ నెరవేర్చినవాని పాపము లన్నియు పోవునని పెద్దలు చెప్పెదరు. కనుక తండ్రి ఆజ్ఞ ప్రకారము తల్లిని చంపుటయే ఈసమయమున నుచితమని తోచుచున్నది.

ఇట్లు చిరకారి తలచి పిదప తల్లిని గూర్చి ఆలోచించ మొదలిడెను.

"నవమాసములుమోసి కనిపెంచిన తల్లిని ఎటుల చంపుదును. తండ్రికంటె తల్లియే గౌరవమున అధికురాలని

వేదములు చెప్పుచున్నవి. ఇట్టి తల్లిని చంపుట ఘోరపాపము. పాపకార్యమును నేనెట్లు చేయగలను."

అని చిరకారి పెక్కువిధముల నాలోచించుచుండెను. చాలసేపు గడచెను. ముని అడవికివెళ్ళిన కొంచెము సేపటికి కోపము తగ్గెను. అతడు విచారముతో "అయ్యో! కోపములో తెలియక తల్లిని చంపుమని కొడుకునకు ఆజ్ఞచేసివచ్చితినిగదా? ఎంతటి పాపముచేసితిని. ఇక నా తపస్సు కాల్పనా? ఈపాటికి అతడు చంపియుండునేమో!" అని తహతహపడుచు కాళ్ళు తడబడుచుండ ఇంటికి పరుగెత్తెను. అట్లు పరుగెత్తుచు చిరకారి తొందరపడువాడు కాడని ధైర్యము తెచ్చుకొని తనలోతాను ఇట్లు అనుకొనసాగెను. "చిరకారీ! నేను మూఢత్వమున తొందరబడితిని. నిన్ను పెంచిపెద్దవానిజేసిన తల్లిని జంపకయుంటివేని నీపేరు సార్థకమగును" అని తలచుచు ఇల్లు జేరెను.

చిరకారి తల్లిని చంపుట తగునా తగదా యని విచారించుచుండెను. ఇంతలో తండ్రివచ్చి కుమారుని కౌగలించుకొని "నాయనా! నాకును నాతపమునకును నిందరాకుండ రక్షించితివి" అని పొగడెను. కనుక బుద్ధిమంతుడు ఆలోచన చేసి పని చేయవలెను.

గీ॥ తామసించిచేయఁదగ దెట్టి కార్యంబు
వేగిరింప నదియు విషముమగును
పచ్చికాయఁదెచ్చి పడవేయ ఫలమౌనె?
విశ్వదాభిరామ వినురవేమ.

—:(o):—

# 17 అపకారికైననుడు పకారమే చేయుము

పూర్వము ఒక బోయవాడు పక్షుల చంపి వానిలో గొన్నిటిని తిని తక్కిన వానిని అమ్ముకొనుచు జీవించుచుండెను. ఒకనాడాతడు అడవిలో వలవేసి పక్షులబట్టి సాయంకాలమునకు ఇంటికి బోవజూచుచుండెను. ఇంతలో గొప్ప గాలివాన వచ్చెను. వాడు తడిసి వణుకుచు ఒక మఱ్ఱిచెట్టు క్రింద కూర్చుండెను.

ఆ చెట్టు తొఱ్ఱలో ఒక పావురముండెను. తన భార్య మేతకువెళ్ళి రాలేదని అది దుఃఖించుచు "ఎచటికేగినదో నాభార్య! నన్ను విడిచి ఒక నిమిషమైన ఉండునా! ఈపాడు గాలివాన వలన ఎచ్చటనైన పడిపోయినదేమో! ఇపుడేమి చేయుదును" అని విలపించుచుండెను. ఆడుపావురము అచ్చటనే ఉన్న బోయవాని వలలో జిక్కుకొని ఉండి తన భర్త

మాటలను వినెను. భర్తకు తన స్థితి దెలిపి, చింతింపవలదని పలికె, మరియు ఇట్లనియె.

"నాథా! అపకారము చేయువానికైనను ఉపకారము చేయుట మంచిదని పెద్దలు చెప్పెదరు. కనుక చలిచే వణుకుచు చనిపోవుటకు సిద్ధముగా ఉన్న ఈబోయకు నీచేతనైన సహాయము జేసి బ్రతికింపుము" అని చెప్పెను. అంత నామగ పావురము దుఃఖము విడిచి బోయవానివద్దకు జేరి అతనితో నిట్లనియె. "అన్నా నీవు మిగులశ్రమనొంది మాయింటికివచ్చి నాడవు. ఆలస్యముచేయక నీకోరిక తెలుపుము." అప్పుడా బోయవాడు సంతోషించి "చలిచే శరీరము కొయ్య అయి నది. ఈ ఆపదను తొలగించి రక్షింపుమా!" అనెను.

వెంటనే పావురము చిన్నపుల్లలను ముక్కుతో దెచ్చి కుప్పబోసెను. సమీపమున యున్న పల్లెకుబోయి నిప్పు దెచ్చి మంటజేసి చలిగాచుకొనుమని బోయవానిని ప్రార్థించెను. కొంతసేపటికి బోయవానికి చలిబాధతగ్గి ఆకలిబాధహెచ్చెను. ఆసంగతి వాడు పావురమునకు తెలిపెను. పావురము తన్ను కాల్చుకొని తినుమని మండుచున్న నిప్పులోబడి చనిపోయెను. అ విచిత్రమునకు బోయవాడు ఆశ్చర్యమొంది ఇట్లు తలచెను.

"లోకములో ఇట్టి చిత్రము ఎక్కడనైన గలదా? ఈ పావురము ఇతరులకు గాను తన శరీరము ఇచ్చెను. నేను అప కారము చేసినను నాకు ఉపకారమే చేసినది. ఈపక్షియే

నాకు గురువై మంచినీతిని బోధించినది. ఇకనుంచి నేను జీవహింస చేయకుందును" అతడట్లు నిశ్చయించుకొని వలలో జిక్కుకొనియున్న పక్షుల విడిచి వెళ్ళిపోయెను. వలనుండి విడువబడిన ఆడుపావురము తన భర్త చనిపోవుటకు దుఃఖించి ఆ నిప్పుయందే తానును బడి చనిపోయెను.

"క. ఉపకారికి నుపకారము
విపరీతముగాదు సేయ ♦ వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాడు ♦ నేర్పరి సుమతీ.

# 18 శరణుజొచ్చిన వారిని గాపాడవలెను.

దశరథుడు అను రాజునకు రాముడు, లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు అను కుమాళ్ళు గలరు. పెద్దవాడగు రాముడు తండ్రిమాట ప్రకారము భార్యయగు సీతతోను, తమ్ముడగు లక్ష్మణునితోను అడవులకు వెళ్ళెను. వారు దండకారణ్యములో కాపురముండిరి. ఒకనాడు రాముడును లక్ష్మణుడును ఇంటిలో లేరు. ఆసమయమున లంకలో ఉండు రాక్షసుల రాజైన రావణుడు వచ్చి సీతను ఎత్తుకొనిపోయెను.

రామలక్ష్మణులు ఇంటికి వచ్చి సీతను గానక ఆమెను వెదకుచు వెళ్లిరి. తిరిగి తిరిగి వారలు కిష్కింధ అను పట్టణము

చేరిరి. ఆపట్టణమును కోతులరాజైన సుగ్రీవుడు పాలించు చుండెను. రాముడు సుగ్రీవునితో స్నేహముచేసి అతనికి చాల సహాయము చేసెను. సుగ్రీవుడు కోతులను పంపి సీత లంకలో ఉన్నదను సమాచారము రామునకు దెలిపెను.

తరువాత రాముడు సుగ్రీవుని వానరసైన్యముతో లంకకు బయలుదేరెను. లంకకు వెళ్ళుటకు సముద్రము అడ్డముగ నుండెను. వారు కష్టపడి సముద్రమునకు వంతెనగట్టిరి. పిమ్మటరాముడును లక్ష్మణుడును, సుగ్రీవుడును, సైన్యముతో సులభముగా లంకలో ప్రవేసించిరి. సీతను దెచ్చి శరణువేడ మనియు లేదా యుద్ధమునకు రమ్మనమనియు రావణునకు రాముడు కబురు పంపెను.

రావణుడు యుద్ధప్రయత్నముచేయసాగెను. అప్పుడు అతని తమ్ముడైన విభీషణుడు వచ్చి, రామునకు సీతనిచ్చి శరణువేడు మని చెప్పెను. విభీషణుడు చాలమంచి గుణములు గలవాడు. రావణుడు, తనకామాటలు చెప్పినందులకు కోపించి తమ్ముడగు విభీషణుని తన్ని వెళ్ళగొట్టెను.

విభీషణుడు అంతట తిన్నగా రాముని వద్దకు వెళ్లి "స్వామీ! నేను రావణుని తమ్ముడను. విభీషణుడనువాడను. దుర్మార్గులైన రాక్షసులవద్ద నుండనేరక మిమ్ముల శరణు వేడవచ్చితిని రక్షింపుము" అని కాళ్ళమీదపడెను. అప్పుడు కోతులలో కొందరు "వీడు దొంగ. వీనిని దగ్గరకుజేరనీయ

కుడు" అని రామునకు చెప్పిరి. రాముడు వారల మాటలు వినక "శరణన్నవాడు పగవాడైనను రక్షించవలయును." అని విభీషణునకు అభయము మిచ్చెను. ఇంకను అప్పుడే రావణుని చంపి లంకారాజ్యమునకు రాజుగా విభీషణునిచే సెదనని ప్రతిజ్ఞ కూడ చేసెను.

"ఆ, చంపదగినయట్టి శత్రువు తనచేత
జిక్కెనేని కీడు సేయరాదు
పొసగ మేలుచేసి పొమ్మనుటే చాలు
విశ్వదాభిరామ వినురవేమా.'

—:(౦):—

## 19 అమితముంగా భుజించకూడదు.

పూర్వము శ్వేతకి అను రాజుండెను. అతడు చాల దాన ధర్మములు, యజ్ఞములు చేసెను. ఒకప్పుడు నూరు సంవత్సరముల కాలము సత్రయాగము అను యజ్ఞమును అతడు చేసెను. ఆ యాగములో అగ్నిదేవుడు ఎక్కువగా నేతిధారలను త్రాగెను. అందువలన అగ్నిదేవునికి అజీర్ణరోగము వచ్చెను. కడుపు నొప్పికూడ సాగెను. రోగము క్రమముగా హెచ్చెను.

అగ్నిదేవుడు దేవతలవైద్యులగు అశ్వనీదేవతల వద్దకు వెళ్ళి తనరోగమునకు మందు ఇమ్మని వేడెను. "నీరోగమునకు మందు దేవేంద్రుని ఖాండవ వనమునందు గలదు. దానిని తినిన

నయముకాగలదు" అని చెప్పిరి. అంతట అగ్నిదేవుడు ఖాండవ వనము తగులబెట్టసాగెను. దేవేంద్రుడు అది చూచి మంటల చల్లార్పమని మేఘముల పంపెను. మేఘములు వర్షించి ఆమంటను చల్లార్చినవి. ఎన్నిమారులు ప్రయత్నించినను అగ్ని దేవుని కోరిక సాగలేదు.

ఇట్లుండ ఒకనాడు,కృష్ణుడు అర్జునుడు ఖాండవ వనము దగ్గరతిరుగుచుండిరి. అగ్నిదేవుడు వారివద్దకు బ్రాహ్మణవేషముతో వెళ్ళి, "స్వామీ! నేను అగ్నిదేవుడను. కడుపునొప్పి వలన బాధపడుచున్నాను. ఈవనమును దహించిన నానొప్పి పోవును. కాని దేవేంద్రుడు వర్షముకురిపించి ఆటంకపరచుచున్నాడు. కావున మీరు నన్ను రక్షింపుడు అని వేడెను. అర్జునుడు అగ్ని దేవుని చూచి, "నీయిష్టము చొప్పున ఈవనమును భుజించుము. నేను రక్షించెద." అని చెప్పినంతనే దేవేంద్రుడు వర్షము కురిపించసాగెను. అర్జునుడు తన విలువిద్యచే వర్షము ఖాండవ వనము మీద పడకుండునట్లు చేసెను. అగ్నిదేవుడు ఖాండవ వనమును దహించి తన రోగమును పోగొట్టుకొనెను.

"గీ. అన్నమధికమైన నదియుఁ దాజంపు, నా
యన్న మంటకున్న నాత్మనొచ్చు
చంపనోంప బువ్వ చాలదా వెయ్యేల,
విశ్వదాభిరామ వినుర వేమా."

## 20 తల్లిదండ్రులు దేవునితో సమానులు.

పూర్వము కౌశికుడను బ్రాహ్మణుడు వృద్ధులైన తల్లి దండ్రుల వదలి తపస్సుచేయుటకు అరణ్యమునకు వెళ్ళెను. అడవిలో అతడు ఒకచెట్టుక్రింద కూర్చుండి తపస్సుచేసుకొనుచుండెను. ఒకనాడు చెట్టుమీదనుండి ఒకకొంగ అతనిమీద రెట్టవేసెను. అందుల కతడు కోపదృష్టితో కొంగనుచూచెను. వెంటనే కొంగ చచ్చెను. తన తపోబలముచేత కొంగ చచ్చినదని అతడు తనలో తాను సంతోషించెను.

మామూలుగా ఒకనాడాతడు మధ్యాహ్నము వరకు తపస్సుచేసి భిక్షకు గ్రామములోనికి వెళ్ళెను. అతడు ఒక బ్రాహ్మణ ఇంటికి వెళ్ళి భిక్షపెట్టుమని కోరెను. ఆ ఇంటి యజమానురాలు కొంచెమాలస్యముగా భిక్షతెచ్చెను. ఆలస్యమైనందులకు ఆమె మీద అతనికి కోపమొచ్చెను. కొంగను చూచినట్లు అమెనుకూడ కోపదృష్టితో చూచెను. కొంగచనిపోయినట్లు ఆమెకూడ చనిపోవునని అతడు తలచెను.

ఆమె దివ్యదృష్టివలన అతని చరిత్ర తెలిసికొనినదై "ఓయీ! నీతపోబలముచేత కొంగ చచ్చినదని గర్వించకుము. నీవు పాపివి నీమొగము చూడకూడదు" అని తలుపువేసుకొనను. అప్పుడు కౌశికుడు ఆమె కాళ్ళపైబడి తన్ను జ్ఞానము ఉపదేశించుము అని వేడెను. ఆమె అతనిని

కనికరించి "మిథిలాపురమున ధర్మవ్యాధుడు అను కటికవాడు గలడు. అతనిని ఆశ్రయించి జ్ఞానము పొందుము" అని చెప్పెను. కౌశికు డంతట మిథిలాపురమునకు వెళ్లి ధర్మవ్యాధుని ఇల్లు చేరెను. ధర్మవ్యాధుడు బ్రాహ్మణునికి యెదురుగా వచ్చి మర్యాదజేసి "జ్ఞానముపొందుటకు పతివ్రత బంపగా వచ్చితివిగదా! అని ప్రశ్నించెను. బ్రాహ్మణుడు ఆశ్చర్యమొంది "నీకు ఆసంగతి ఎటుల తెలిసినది" అని ధర్మవ్యాధుని అడిగెను." అని బోధించెను.

పిమ్మట బ్రాహ్మణుని ధర్మవ్యాధుడు ఇంటిలోనికితీసుక వెళ్ళి ఇంటిమధ్య ఒక తూగుటుయ్యాలలో ఊగుచున్న తన తల్లిదండ్రుల జూపి "వీరే నాదైవములు. వీరిని ప్రతి దినము పూజించుదును. వీరి సౌఖ్యమే నాసౌఖ్యము. వీరి సంతోషమే నాసంతోషము. వీరి సేవచే నాకు ఈ జ్ఞానమును సంపదయును కలిగినవి. నీవు పాపాత్ముడవు. తల్లిదండ్రులను వదలిపెట్టితివి. వారు దిక్కులేక బాధలుపడుచు-నీకొరకు విలపించుచున్నారు. ఇకనైన త్వరితముగావెళ్లి నీతల్లిదండ్రుల సేవజేసి కృతార్థుడవుగమ్ము.

అప్పుడా కౌశికుడు తెలివి తెచ్చుకొని ఇంటికి వెళ్ళెను. వృద్ధులగు తల్లిదండ్రుల సేవలుచేసి సకల సౌఖ్యములు పొందెను. కావున తల్లిదండ్రులను దేవునితో సమానులుగా యెంచి పూజచేయవలెను.

సమాప్తము.

# పురాణనీతికథలు

## నాల్గవ భాగము

గ్రంథకర్త
మాదిరాజు రాధాకృష్ణమూర్తి.

పబ్లిషర్సు
తాలూకాబోర్డు ఉపాధ్యాయసంఘము,
తెనాలి

 [వెల రు 0—5—0 లు.

# విషయ సూచిక.





# పురాణనీతికథలు

## నాల్గవ భాగము



### 1. అంబరీషుఁడు

తొల్లి అంబరీషుఁడు అను నొక రాజు గలఁడు. అతఁడు గొప్ప దైవభక్తుఁడు. అనేక యజ్ఞములను, యాగములను చేసెను. ఆతఁ డొకప్పుడు శ్రీహరికిఁ బ్రీతిగా ద్వాదశీవ్రతముఁ జేసెను. కార్తికమాసమున వ్రతము ముగిసెను. అతఁడు గాంట మూఁడు రాత్రులుపవాస ముండి, యమునాజలముల స్నాన మాడి, శ్రీవిష్ణువునకు మహాభిషేకము గావించెను. పిమ్మటఁ బెక్కువేల బ్రాహ్మణులకు మృష్టాన్నమిడి, యాతఁడు భుజించుట కూహించుచుండెను. ఆ సమయమున, దుర్వాసుఁడను మునీంద్రుఁ డక్కడికి వచ్చెను. అంబరీషుఁ డా మునినిఁ దనయింట భుజింపుమని వేఁడెను. ముని సంతోషముతో నందుల కంగీకరించి, స్నానమాడి వచ్చెదనని యమునానదికిఁ బోయెను.

దూర్వాసుఁడు నదియందుఁ బ్రవేశించి, ఈశ్వర ధ్యానమున నిందుసంగతి మఱచి, యందే మునిఁగి యుండెను.

అంబరీషునకు పారణసమయము దాఁటిపోవు చుండెను. ముని యెంతసేపటికిని రాలేదు. ద్వాదశిఘడియల లోపుగ నంబరీషుఁడు భుజింపవలయును. భుజింపకున్న వ్రతభంగము వాటిల్లును. రాజున కేమియు తోఁచలేదు. విద్వాంసులను కర్తవ్యము నిర్ణయింపుఁడని ప్రార్థించెను.

క. "ముని నీరుపోచ్చి వెడలఁడు
చనియెడు ద్వాదశియు నింతఁజనియెను నీలో
నన పారణ సేయవలయు
వినిపింపుం డర్హధర్మ విధ మెట్టిదియో."

విద్వాంసులు "రాజేంద్రా! ద్వాదశిపారణ సేయకుండుట మహాపాతకము. కాని, బ్రాహ్మణుని విడిచి, పారణ సేయుట మహాదోషము. కావునఁ గొంచెము జలముద్రావుట కర్తవ్యము." అని పలికిరి. రాజు శ్రీహరిం దలఁచి కొంచెము జలము ద్రావెను. దూర్వాసుఁడింతలో వచ్చి, రాజు జల పారణసేయుటఁ దెలిసికొనెను. అతఁడు మండిపడి, "దురాత్మా! నాయంతివానిఁ నాతిథ్యమునకుఁ బిలిచి, నేను రాకుండగనే పారణ సేసితివి గదా! నిను సైపఁజాల." అని పండ్లు గొఱుకుచు, జడఁబెఱికి నేలకుఁ గొట్టెను. వెంటనే భయంకరమైన శక్తి యొకటి యా జడనుండి బయలుదేఱి, రాజుమీఁది కుఱికెను.

అంబరీషుఁడు దన్ను రక్షింపుమని చేతులు జోడించి శ్రీహరినిఁ బ్రార్థించెను. శ్రీహరి, యా శక్తినిఁజంప తన చక్రమును విడిచెను. ఆ చక్రము శక్తినిఁజంపి, కోపిష్ఠుఁడగు దుర్వాసుని మీఁదికిఁ బోయెను. ఆ చక్రాగ్నిజ్వాలలకు సైఁపఁజాలక దుర్వాసుఁడు పరుగెత్తెను. అదియు వెంటఁబడెను. మునీంద్రుఁడు భయమొందుచు బ్రహ్మయొద్దకుఁ బోయి, రక్షింపుమని వేఁడెను. బ్రహ్మ "ఓయీ! నావలనఁ గాదు. శ్రీహరిచేఁ బ్రయోగింపఁబడిన యీ చక్రమునాప నెవరికి శక్యము?" అని బదులిడెను. పిమ్మట, దుర్వాసుఁడు కైలాసమునకుఁ బోయి, రుద్రు నాశ్రయించెను. ప్రయోజనము లేక పోయెను. అంతట, శ్రీహరియొద్ద కేగి, "మహానుభావా! కోపముచేఁ దెలియక నీ భక్తునకెగ్గు సల్పితిని. నన్ను క్షమించి రక్షింపుము." అని వేఁడెను. భగవంతుఁడు దుర్వాసుని మందలించి, అంబరీషునే శరణువేఁడుమని సెలవిచ్చెను.

దుర్వాసు డహంకారముఁ జంపుకొని, తుదకు అంబరీషునే శరణువేఁడి, ప్రాణములఁ గాపాడుకొనెను.

క. "అనుపమ నియమాన్వితులై
యనూన దక్షిణలఁ గ్రతుసహస్రంబులు సే
సినవారికంటె నక్రో
ధనుఁడు గరంబధికుఁడండ్రు తత్వవిధిజ్ఞుల్."



# 2. ధౌమ్యుఁడు - శిష్యులు

ధౌమ్యుఁడను నొక ఋషి గలఁడు. అతనియొద్ద ఉపమన్యువు, ఆరుణి, బైదుఁడు అను ముగ్గురు శిష్యులు విద్య నేర్చుకొనుచుండిరి.

ఒకనాఁడు, ధౌమ్యుఁడు ఆరుణిం బిలిచి, "ఓయీ! నీవు పోయి, వరిచేనికి బారెడు కాలువతూమున కడ్డుకట్ట వేసిరమ్ము." అని యాజ్ఞాపించెను. ఆరుణి పోయి, యా తూమునుమూయుట కనేక ప్రయత్నములఁ జేసెను. ఎంతయో మన్నుదెచ్చి, నీటిప్రవాహమున కడ్డము వేసెను. కాని, యది నిలువలేదు. ఆరుణి కేమియు తోఁచలేదు. తుదకు, తానే యా ప్రవాహమున కడ్డముగఁ బరుండెను. నీరు చేనిలోనికిఁ బోకుండ నిలిచెను. ఆరుణి యెంతసేపటికిని యింటికి రాలేదు. ధౌమ్యుఁడు ఇరువురు శిష్యులఁ దీసికొని, పొలమునకుఁబోయి, నీటిప్రవాహమున కడ్డముగఁ బరుండియున్న ఆరుణిం జూచెను. ధౌమ్యుఁడు వానిని లేవదీసి, "వత్సా! నీగురుభక్తికిఁ జాల సంతసించితిని. గొప్ప విద్వాంసుఁడవు కాఁగలవు." అని దీవించి, వానికి సమస్తవిద్యలు నేర్పెను.

ధౌమ్యుఁడు, రెండవ శిష్యుఁడగు ఉపమన్యునిఁబార ములఁ జదువుకొనిన పిమ్మట, గోవులను మేపుచుండు

నట్లు నియమించెను. ఉపమన్యుఁ డట్లే చేయుచుండెను. ఒకనాఁడు ధౌమ్యుఁడు ఉపమన్యుని జూచి, "ఓయీ! నీవెట్లు ఇంత బలిసియున్నావు? నేను సుఖముగఁ దిని, యింటఁ గూర్చుందును. నీవలె బలవంతుఁడనై యుండలేదు. కారణమేమి?" అని యడిగెను. అందులకతఁడు, "అయ్యా! నేను బిచ్చమెత్తికొని జీవించుచుంటిని. నాకెన్నియో వంటకములు లభించును. అందువలన, నేను బలిసియుంటిని." అని విన్నవించెను. ధౌమ్యుఁడు వాని గురుభక్తి పరీక్ష సేయఁ గోరి వానితో, "నిత్యమును నీవు సంపాదించు భిక్షను నాకిచ్చుచుండుము." అని యాజ్ఞాపించెను. ఉపమన్యుఁ డటులనే తాను భిక్షించినదెల్ల గురువున కిచ్చుచుండెను.

కొన్ని దినములు గడచెను. ఉపమన్యుఁ డెప్పటివలెనె బలిసియుండెను. ధౌమ్యుఁడు, "ఓయీ! నీవు తెచ్చినదెల్ల నాకర్పించుచుంటివి గదా! నీవెట్లు ఇంకను బలిసియున్నావు?" అని వాని నడిగెను. వాఁడు గురునితో, "అయ్యా! పగలు సంపాదించిన భిక్ష దమకిచ్చి, రాత్రిభిక్ష నేను దినుచున్నాను." అని బదులిడెను. అందులకు ధౌమ్యుఁడు రాత్రిభిక్షఁగూడ తనకే యిమ్మని వాని కాజ్ఞాపించెను. వాఁడట్లే యిచ్చుచుండెను. ఇట్లు మఱికొన్ని దినములు గడచెను. ఉపమన్యుఁడు యథాప్రకారముగనే యుండెను. గురువు మరల వానిని నీవిప్పుడేమి తినుచున్నావు? అని యడిగెను. "గోవులపాలు

త్రాగుచుంటి” నని వాఁడు బదులిడెను. లేఁగలు పాలులేక కృశించుచున్నవనియు, నాఁటినుండి గోవులపాలు త్రాగకు మనియు, ధౌమ్యుఁడు వానికిఁ జెప్పెను. ఉపమన్యుఁ డప్పటి నుండియు దూడలు పాలు త్రాగునప్పుడు బయటికిఁగ్రక్కు నురుగును ద్రాగుచుండెను. అదియును వలదని గురు వాజ్ఞా పించెను.

ఉపమన్యుఁడు దినుట కాహారమేమియు లేక కృశించు చుండెను. ఒకనాఁ డాఁకలిబాధ కోర్వలేక, పాపమతఁడు జిల్లే డాకులను దినెను. ఆ కారణమున నతనికన్నులకు వెంటనే గ్రుడ్డితనము వచ్చెను. వాఁడు గోవులను దోలుకొనివచ్చుచు దారి కనుఁబడక యొక నూతిలోఁ బడెను. చీఁకటిపడినను వాఁడింటికి రాలేదు. ధౌమ్యుఁడు బయలుదేఱి, వెదకుచు వానిపేరుతోఁ గేకలు వేసెను. ఉపమన్యుఁ డా కేకలువిని, నూతిలోనుండియే గురునకుఁ దనయవస్థ దెలియఁజేసెను. తనవలననే వానికట్టి యవస్థ వచ్చినదని ధౌమ్యుఁడు విచార మొంది, అశ్వినీదేవతల బ్రార్థింపుమని వానికొక మంత్ర ముపదేశించెను. వాఁ డటులనే చేసెను. వాని కన్నులువచ్చెను. ధౌమ్యుఁడు వాని గురుభక్తి కచ్చెరువొంది, వానికి సమస్త విద్యలను గఱపి, స్వగ్రామమునకుఁ బంపెను.

ధౌమ్యుఁడు, మూఁడవ శిష్యుఁడగు బైదునిఁ దన యింటఁ బనులు సేయునట్లు నియమించెను. వాఁడును శ్రద్ధా

భక్తులతో సకలవిధముల గురువును మెప్పించి, సమస్తవిద్యలు నేర్చుకొని యింటి కేగెను,

క. "గురుశుశ్రూష యొనర్చుచుఁ
బరమక్లేశమునఁ జేసి పడసిన విద్యల్
స్ఫురియించుఁగాక గురుముఖ
విరహితముగఁ బడసినవియు వెలయునె యెందున్."



# 3. ధర్మవ్యాధుఁడు

ధర్మవ్యాధుఁడు ఒక బ్రాహ్మణుఁడు. అతఁడు సకల విద్యలు, శాస్త్రములు నేర్చెను. అతనికొక రాజకుమారుఁడు స్నేహితుఁడై యుండెను. అతనితోఁ గలిసి ధర్మవ్యాధుఁడు గూడ విలువిద్య నేర్చెను. అతఁడు నిత్యమును రాజకుమారునితో నరణ్యమునకుఁ బోయి, యనేక జంతువులఁ జంపుచుండెను.

ఒకనాఁడు ధర్మవ్యాధుఁడును రాజకుమారుఁడును అరణ్యమునఁ దమ విలువిద్యానైపుణ్యము మెఱయ మృగములఁ జంపుచుండిరి. కాలకర్మమున ధర్మవ్యాధుఁడు విడిచిన బాణ మొక పొదలోఁ దపస్సు చేసికొనుచున్న యొకమునికిఁ

దాకెను. వెంటనే, యామునిి నేలంబడెను. ధర్మవ్యాధుండు భయమొంది, మునిని సమీపించి, క్షమింప వేడెను. ముని కోపదృష్టితో, "ఓరీ! నీవు బ్రాహ్మణుండవు. కులధర్మముల విడిచితివి. కానివారితో స్నేహము సేసి, కానివిద్యల నభ్యసించితివి. కానిపనులకుం దిగి, పాపాత్ముండవైతివి. మృగయా వినోదము బ్రాహ్మణులకుం దగునా? కావున, మృగములం జంపుకొని జీవించు కిరాతజన్ముండవగుదువు గాక!" అని శపించెను. మరలం గరుణించి, 'కిరాతకులమునం బుట్టినను సకల ధర్మములం దెలిసికొనియుందువు." అని యనుగ్రహించెను. ధర్మవ్యాధుండు కిరాతుండై జన్మించెను. మృగములం జంపి, కొంతమాంసమును దినుచు, మిగిలినదాని నమ్ముకొనుచు జీవించుచుండెను.

ఇట్లుండ గౌశికుండను నొక బ్రాహ్మణుండు వృద్ధులైన తలిదండ్రులను విడిచి, యొక వనమున నొక చెట్టుక్రిందం దపస్సుం జేసికొనుచుండెను. ఒకనాండొక కొంగ యాతనిపై రెట్టవేసెను. కౌశికుండు కోపదృష్టితో నా కొంగవంకం జూచెను. కొంగ వెంటనే నేలంబడి చచ్చెను. అంతట మధ్యాహ్నమగుటం జేసి, యతండు భిక్షకొఱకు గ్రామములోనికి వెళ్ళెను. ఒక బ్రాహ్మణునివాకిట నిలిచి, 'భిక్షాందేహి' యనెను. ఆ యింటి యజమానురాలు మహాపతివ్రత. ఆమె పెనిమిటియు నప్పుడే యింటికి వచ్చియుండెను. పతివ్రతా

శిరోమణియగు నా పుణ్యాంగన పెనిమిటికి సపర్యలఁజేసి, కొంచెమాలస్యముగ భిక్షఁదెచ్చెను.

కౌశికుఁడు కోపించి యామెతో, "బ్రాహ్మణోత్తముఁడనైన నన్నింతసేపు నిలిపి యవమానమొనర్చితివి గదా!" అని పలికెను. ఆమె యాతనితో "భూసురోత్తమా! నాకుఁ బతియే దైవము. నాభర్తకుఁ బ్రీతిఁ గలిగించుటయే నాకుఁ బరమధర్మము. ఆతని సౌఖ్యమే నా సౌఖ్యము. ఆతని సేవయే నాకు మోక్షము. నీ వతికోపి వనియు నే నెఱుఁగుదును. నీతపోబలిమిచేఁ గొంగ నచ్చినదని గర్వింపకుము. ఇది నా పాతివ్రత్యమహిమచే నెఱిఁగితిని. క్రోధం బెవ్వానికిని గొఱఁగాదు. క్రోధము జయింపలేని బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుండు గాఁడు. మిథిలాపురమున ధర్మవ్యాధుఁడను కిరాతుఁడు గలఁడు. అతఁడు మహాజ్ఞాని. అతనియొద్ద కేగుము. నీకు సమస్తధర్మములఁ దెలియఁజేయును." అని పలికెను.

కౌశికుఁ డా పతివ్రత పలుకులకు శాంతిఁబొంది ధర్మవ్యాధుని దర్శింపఁ గుతూహలుఁడై మిథిలాపట్టణమునకుఁ బోయెను. ధర్మవ్యాధుఁడు మాంసఖండముల నంగడిఁ బఱచి యమ్ముచు, బ్రాహ్మణునిరాకఁ గాంచెను. ఎదురేగి, నమస్కరించి, 'యా పతివ్రతాశిరోమణి పంపగా వచ్చితివి గదా!' యని స్వగృహమునకుఁ దీసికొని పోయెను. కౌశికుఁడు ధర్మ

వ్యాధునితో, "ధర్మపరుఁడవైన నీకిట్టి జీవహింసతోఁగూడిన జీవనము దగునా?" అని యడిగెను.

ధర్మవ్యాధుఁడు కౌశికునితో, "ఆర్యా! బ్రాహ్మణులకుఁ దపస్సును, రాజులకు రాజ్యపాలనమును, వైశ్యులకు వాణిజ్యమును, శూద్రులకు శుశ్రూషయును నెట్లు కులధర్మములో యట్లే, మాకీ మాంసవిక్రయము కులాచారము. కుల ధర్మము విడుచుట మహాపాపము. కనుక, ఈవృత్తిఁ బూనితిని. అయినను, సత్యము, శౌచము, గురుజనవిప్రపూజ నే నెన్నఁడును మఱువఁజాలను. అందువలన, హీనకులజుఁడ నయ్యు పరిశుద్ధుఁడనై యుంటిని." అని, కౌశికున కింకను ననేకధర్మము లుపదేశించి, "అయ్యా! నీ తలిదండ్రులు వృద్ధులై నీకొఱకు విలపించుచున్నారు. శీఘ్రముగఁ జని వారలఁ బూజించి, కృతార్థుఁడ వగుము." అని పంపెను.

ఆ. "పాపవర్తనుండు బ్రాహ్మణుం డయ్యును
నిజము శూద్రుకంటె నీచతముఁడు
సత్యశౌచధర్మశాలి శూద్రుం డయ్యు
నతఁడు సద్విజుండ యనిరి మునులు."



# 4· గయ్యాళి చండిక

ఉద్దాలకుఁడు అను నొక బ్రాహ్మణు డుండెను. ఆతని భార్య చండిక. ఆమె చాలగయ్యాళి. భర్త సెప్పుపనుల కెల్ల విరుద్ధముగఁ జేయుచుండును. అతఁడు సంధ్యవార్చఁ బాత్రను దెమ్మనినఁ, బాత్రను రాతిమీఁదఁ బగులగొట్టును. నుడిపంచను దెమ్మనిన, దానిని రెండుగాఁ జించును. జపమాలి కను దెమ్మనిన, మాలికఁ ద్రెంచి పూసలు వెదఁజల్లును. వంట వేగంబె కావలెననినఁ, గడవలు పగులగొట్టును. కోపము వలదేయనిన, రోఁకలిచే మోఁదును. ఈవిధముగఁ బ్రతికూలవర్తన యగు భార్యచేతఁ బడరానిపాటులఁ బడుచు, బ్రహ్మచారియు. గృహస్థుఁడును గాక, యాతడవస్థలఁ బొందుచుండెను.

ఉద్దాలకుని గురువు కౌండిన్యుఁడు. అఁతడు శిష్యులతోఁ దీర్థయాత్రపోవుచు నాతోవవనవచ్చి, యుద్దాలకునింటికిఁ జనుదెంచెను. ఉద్దాలకుఁడు గురువును వాకిటనేనిలిపి, తనభార్య ప్రతికూలవర్తనం బెల్లని వేదించి, మిగుల దుఃఖించెను. కౌండిన్యు డుద్దాలకునితో, "ఓయీ ! అయినదానికేమి సేయగలము ? అగ్నిసాక్షిగాఁ బెండ్లాడిన సతు లెట్టివారైనను విడువఁగూడదు. దీనికొక యుక్తి సెప్పెద. చేయవలసిన పని చేయవలదనుము.

చేయఁగూడని పని చేయుచునుము. ఇట్లు చెప్పితివేని నీకోరి కలు నెఱవేరుచుండును." అని యానతిచ్చెను.

ఉద్దాలకుఁ డంతట నింటిలోనికేగి, భార్యతో "ఓసీ! మన యింటివాకిట నెవ్వరోకొందఱు వచ్చియున్నారు. వారలఁ దిట్టి వెడలఁగొట్టుము." అని చెప్పెను ఆ పలుకులు విని, నా చండిక "అక్కటా! అతిధుల నట్లు సేయుదురే?" అని వారలయొద్ద కేగి, నమస్కరించి సగౌరవముగ లోనికిఁ దీసికొనివచ్చెను. ఉద్దాలకుఁ డా దినమంతయుఁ గోపము నటించుచు, నతిథులకు నుపచారములఁ జేయవలదనియు, నన్నపానాదు లీయవలదనియు భార్య నాజ్ఞాపించుచుండెను. భర్తయాజ్ఞలకు వ్యతిరేకముగఁ జేయుటయే చండిక నియమము. కావున, నామె వారిని భక్తితోఁ బూజించి, షడ్రసోపేతముగ నన్నపానము లొసంగ సంతృప్తులఁ గావించెను. ఉద్దాలకుఁ డేలయు మనసులో సంతోషించెను.

మఱునటిదినము ఉద్దాలకుని తండ్రిగారి యాబ్దికము. అతఁ డుదయముననే నిదురనుండి లేచి, భార్యతో "ఓసీ! ఈనాఁడు మా నాయనగారి తద్దినము. శరీరము స్వస్థతగా లేదు. తద్దినము మానివేసెద." అని పలికెను. చండిక మండిపడి, "బ్రాహ్మణుఁడవై తద్దినము మానెదవా? బుద్ధితెచ్చుకొని వెంటనే స్నానముచేసి, బ్రాహ్మణులకుఁ జెప్పుము." అని కేక

లిడెను. 'సరే! ఎటులనో తద్దినము పెట్టెదను. సంధ్యావందనము రాని కులభ్రష్టుల భోక్తలుగాఁ బిలిచెద. కాని, మన యింటియందున్న బ్రాహ్మణుల నియోగింపను.' అని ఉద్దాలకుఁడు స్నానమునకు లేచెను. "నీకు పాపభీతి లేదు. సద్బ్రాహ్మణులు యింట నుండఁగా నెచ్చటకోపోయి, యనాచారుల దెచ్చెదవా?" అని చండిక గద్దించెను.

ఉద్దాలకుఁడు మనసులో గురువునకు వందనము లర్పించుచు స్నానము సేసెను. అంతట కౌండిన్యుని, నాతనిశిష్యులను భోక్తలుగా నియమించి, గురువుసెప్పిన పద్ధతివెంబడి భార్యచేతఁ బనులు సేయించుచు, పితృకార్యము యథావిధిగ జరుపుచుండెను.

తద్దినము ముగియవచ్చెను. పాపము! ఉద్దాలకుఁడు సంతుష్టుఁడై యొడలుమఱచి, పారణను గంగలోఁ గలుపుమని భార్యతోఁ జెప్పెను. ఆ గయ్యాళిచండిక తత్క్షణమే నీతండ్రి తద్దినము పాడుగాను'అని యీరపాణను పెంటగోతిలోఁ బాఱవేసెను.

శ్రాద్ధము వ్యర్థమైనందులకు ఉద్దాలకుఁడు మిక్కిలి విచారించి, అట్టి గయ్యాళితోఁ దానిఁక కాపురము సేయఁజాల నని, చండికను నొక శిలయై పడియుండునట్లు శపించి, తపోవనములకుఁ బోయెను.

క. "సంతత గృహమేధి ఫలం
బింతయుఁ బడయంగనోపు ననుగుణభార్యా
వంతుం డగువాఁడు క్రియా
వంతుం డుదాంతుఁడు పుత్రవంతుండు నగున్."



# 5. ధృతరాష్ట్రుడు.

ధృతరాష్ట్రుఁడును పాండురాజును అన్నదమ్ములు. ధృతరాష్ట్రునికి దుర్యోధనుఁడు మొదలుగాగల నూఱుగురు కుమారులు గలరు. వీరిని 'కౌరవు' లని యందురు. పాండురాజునకు ధర్మరాజు, భీముఁడు, అర్జునుఁడు, నకులుఁడు సహదేవుఁడు అను నైదుగురు కుమారులు గలరు. వీరిని 'పాండవు' లని యందురు. పాండవులతండ్రి చిన్నతనముననే చనిపోయెను. అందువలన, వారు పెత్తండ్రి పోషణములో నుండిరి.

కౌరవులును, పాండవులును ద్రోణాచార్యునొద్ద విద్య నభ్యసించుచుండిరి. పాండవులు మంచి మేధావంతులు. బుద్ధిమంతులు. వారు శీఘ్రముగ నెల్లవిద్యల నేర్చిరి. ద్రోణాచార్యులును, తదితరులును వారి తెలివితేటల కచ్చెరువొందు

చుండిరి. ధృతరాష్ట్రుఁడు తనకుమారుల తెలివితక్కువనుఁ జింతించుచు పాండవుల తెలివితేటలకు నసూయపడుచుండెను.

కౌరవులు పాండవులను ద్వేషించుచు వారి కనేక బాధలు కలుగఁజేసిరి. విషముఁ బెట్టించిరి. సముద్రములోఁ ద్రోయించిరి. ఎన్ని చేసినను సన్మార్గులైన పాండవులు చావరైరి. ధర్మరాజు ధర్మబుద్ధిని, భీముని బలమును, అర్జునుని యస్త్ర విద్యానైపుణ్యమును, నకులసహదేవుల చాకచక్యములను ప్రజలందఱు వేనోళ్ళఁ బొగడుచుండిరి. కౌరవులు పాండవులను మరింత నసహ్యింపఁ జొచ్చిరి. వారి నెటులైనఁ జంప నిశ్చయించిరి.

దుర్యోధనుఁడు కాశీలో నొక లక్కయిల్లు కట్టించెను. తన తండ్రియగు ధృతరాష్ట్రునిచేతఁ జెప్పించి, పాండవు లందు కాపురముండునట్లు చేయించెను. ఒకరాత్రి పాండవులు నిద్రించు నప్పుడు దుర్యోధనుడు, ఆ లక్కయింటికి నిప్పు ముట్టించెను. పాండవు లెటులనో బ్రతికి రహస్యముగఁ దిరుగాడు చుండిరి. ఇతరుల కీర్తికి నసహ్యపడు ధృతరాష్ట్రుఁడు పాండవులు సచ్చిరని లోలోన సంతసించెను.

పాండవులు తుదకు, ద్రుపదరాజ పుత్రికను బెండ్లాడి ద్రుపదనగరమున సౌఖ్యముగ నుండిరి. కౌరవు లీ వార్త విని మిగుల దుఃఖించిరి. ధృతరాష్ట్రుఁడు జనులు నిందింతురని,

పైకి సంతోషము నటించుచు లోలోనఁ గుళ్ళుచుండెను. పాండవులఁ బిలిపించి వారలరాజ్యము వారలకిమ్మని, పెద్దలందఱు ధృతరాష్ట్రుని జీవాట్లు వేసిరి. ధృతరాష్ట్రుఁడు విధిలేక పాండవుల రావించి, వారి సగముపాలు రాజ్యమిచ్చి, తన కొడుకులతో సంబంధము లేకుండ నింద్రప్రస్థపురమున నుండు నట్లేర్పాటుచేసెను.

ధర్మరాజు రాజ్యమును మహావైభవముగ నేలుచుండెను. మహాబలసంపన్నులైన యాతనితమ్ములుభూమి మీఁదఁగల రాజులనెల్ల జయించి కానుకలఁ దెచ్చిరి. రాజాధిరాజులకుఁ గూడ నలవిగాని రాజసూయ మను నొక గొప్ప యాగము నాతఁడు సేసెను. దేవతలు సైతమాతని గొప్పతనమును గీర్తించిరి.

కౌరవులు పాండవుల కీర్తిని సహింపలేక పోయిరి. వారొక మాయాద్యూతమును గల్పించిరి. అందాడుటకుఁ గపటబుద్ధిగల ధృతరాష్ట్రుఁడు ధర్మరాజును బిలిపించెను. అది మాయాద్యూతమని ధర్మరా జెఱుఁగఁడు. అందోడిన వారు రాజ్యమును వదలి పండ్రెండు సంవత్సరము లడవులలో నుండునట్లు నియమ మేర్పరచుకొనిరి. ఆ మాయాద్యూతమందు ధర్మరాజే యోడెను.

ధర్మపరులైన పాండవులు రాజ్యమును కౌరవులకు నప్పగించి యడవుల పాలైరి. ప్రజలందఱు బహుశోకించిరి. పెద్దలు ధృతరాష్ట్రుని ఛీ ఛీ యనిరి. పాండవు లడవుల యందు నశింపోయెదరని కౌరవులు తలంచిరి. కాని, దైవ సంపన్నులైన పాండవు లెటులనో వనవాసము గడపిరి. పిమ్మట, తమ రాజ్యము దమ కిమ్మని, కౌరవుల నడిగిరి. దురాశాపరులైన కౌరవులు రాజ్యమియ్యక పాండవులతో యుద్ధమునకుఁ దలపడిరి.

కౌరవులకును బాండవులకును బదునెనిమిది దినములు ఘోరయుద్ధము జరిగెను. కౌరవులందఱును బంధువులతో మరణించిరి. గ్రుడ్డియగు ధృతరాష్ట్రుడు మాత్రము మిగిలెను. శౌర్యవంతులును, ధర్మాత్ములును నైన పాండవులు జయించిరి.

ధృతరాష్ట్రుఁడు తన యసూయయే కౌరవకుల నాశనమునకుఁ గారణంబని తెలిసికొనినవాఁడై యా చింతతోడనే తుదకు మరణించెను.

క. "పరుల ధనమునకు, విద్యా
పరిణతికిం, దేజమునకు, బలమునకు, మనం
బెరియఁగ నసహ్యపడు న
న్నరుఁడు దెవులులేని వేదనంబడు నధిపా!"



# 6 నాడీజంఘుఁడు

గౌతముఁడు అను నొక బ్రాహ్మణుఁడు గలఁడు అతఁడు కులాచార ధర్మముల విడిచి, యొక బోయదానినిఁ బెండ్లాడెను. దానితో నిరంతర భోగలాలసుఁడై యుండెను. కొన్నిదినములకు సంతానము గలిగెను. కుటుంబభార మెక్కువ యయ్యెను. ధనార్జనమునకై యాతఁడు దేశాటనము సేయ మొదలిడెను. ఆతఁ డొకనాఁడు డస్సి, యొక మఱ్ఱిచెట్టుక్రింద విశ్రమించెను.

ఆ మఱ్ఱిచెట్టుమీఁద నాడీజంఘుఁడు అను పేరుగల యొక కొంగ నివసించుచుండెను. అది మిక్కిలి పరోపకార బుద్ధి గలది. చెట్టుక్రింద విశ్రమించియున్న బ్రాహ్మణునిఁ జూచి, "అయ్యా! నీ వెవఁడవు? ఎచ్చటనుండి యెచ్చట కేగెదవు? నిన్నుఁ జూడ నాకు సంతస మొదవుచున్నది. ఈనాఁడు నాకతిథి వైతివి" అని పలికెను. ఆభూసురుఁడు కొక్కెరఁ గాంచి యిట్లు బదులిడెను. "బకశ్రేష్ఠమా! నేనొక బ్రాహ్మణుఁడ. దురభ్యాసములకులోనై, కులధర్మముల విడిచి, యొక బోయ దానిఁ బెండ్లాడి చెడితిని. ధనార్జనమునకై పోవుచు, నిప్పు డిచ్చట విశ్రమించితిని." ఆ కొంగ యాతని నాదరించి, తానుదెచ్చిన చేపలను, గొన్ని ఫలములను దినుటకొసంగి, యాతని యాఁకలిబాధఁ దీర్చెను. పిమ్మట చిగురుటాకులతో నొక పాన్పుగావించి, పరుండఁ బెట్టెను.

మఱుఁనాఁడుదయమున, నాడీజంఘుఁడు బ్రాహ్మణు నితో "ఓ గౌతమా! లోకములో ధనవంతుఁడే పూజ్యుఁడు. ధనము సంపాదించుటకుఁ గల సాధనములందు మిత్రసహాయము మొకటి. నేను నీకు మిత్రుఁడను. నాచేతనైన సహాయముఁ జేసెద. ఇచ్చటకు దాపున మధువ్రజమను పట్టణమును విరూపాక్షుఁడను రాజు పాలించుచున్నాఁడు. అతఁడు నాకుఁ బరమ మిత్రుఁడు. నీవు వానియొద్ద కేగి, నేను పంపితినని చెప్పుము. నీకు వలసినంత ధన మొసంగును." అని పలికిన, గౌతముఁడు సంతసించి, శీఘ్రముగా విరూపాక్షునియొద్ద కేగెను. విరూపాక్షుఁడు బ్రాహ్మణునిఁ జూచి, 'ఈతఁడు వంచకుడని తోఁచు చున్నది. అయినను నా మిత్రుని కోరిక నెఱవేర్చెద.' అని యాతఁడు మోయఁగలిగినంత ధనమిచ్చి పంపెను.

గౌతముడు ధనమును మోపుజాలక మోసి, సాయంకాలమునకు నాడీజంఘునియొద్దకుఁ జేరెను. నాడీజంఘుఁడు స్నేహితుని రాకకు సంతసించి, డస్సియున్న యాతనికిఁ దన ఱెక్కలతోఁ గొంతసేపు విసరెను. పిమ్మట, చేపలను, ఫలములను నిచ్చి యాఁకలి దీర్చెను. ఆ రాత్రి నాడీజంఘుఁ డొడలు మఱచి, నిద్రించుచుండెను. కృతఘ్నుఁడగు గౌతముఁడు దనలో "ఈకొక్కెర బలిసియున్నది. దీనిం జంపిన రేపటికాహారము కాఁగలదు." అని యోజించి, వెంటనే నాడీ

జంఘునిఁ జంపెను. దాని మొదలిమీఁది యీఁకలఁ దీసివేసి, మాంసముదీసి, మూటఁగట్టికొని, యింటికిఁ బయనమయ్యెను.

నాడీజంఘుఁడు ప్రతిదినమును స్నేహితుఁడైన విరూపాక్షునిఁ జూచివచ్చుచుండు వాఁడుక గలదు. ఆనాఁడెంత ప్రొద్దెక్కినను "మిత్రుఁడు రాలేదే!" అని విరూపాక్షుఁడు కలఁత నొంది, హేతువు కనుగొనిరండని భటులఁ గొందఱనుబంపెను. ఆ భటులువచ్చి, కొంగయీఁకలఁ జూచిరి. వెంటనే వారు మరలిపోయి, విరూపాక్షునకుఁ జెప్పిరి. ఆ దుర్మార్గమును గౌతముఁడే చేసియుండునని విరూపాక్షుఁడు నిశ్చయించి, వానింబట్టి తెండని భటుల కాజ్ఞాపించెను. భటులు పరుగిడి, గౌతముని చేతులు విఱిచికట్టి తెచ్చిరి. విరూపాక్షుఁడు భటులతో 'వీనింజంపి మాంసమును గుక్కలకును, నక్కలకును వేయుఁడు' అని యాజ్ఞాపించెను. కాని, యాకృతఘ్నుని మాంసమును గుక్కలును నక్కలునుగూడ ముట్టవయ్యెను.

విరూపాక్షుఁడు మిత్రుని మృతికి చాలచింతతో నుండెను. ఇంతలో బ్రహ్మదేవుని దయవలన నాడీజంఘుఁడు సజీవుఁడై, విరూపాక్షుని యొద్దకువచ్చి బ్రహ్మానంద మొసఁగెను. దయామయుఁడైన నాడీజంఘుఁడు బ్రహ్మదేవునిఁ బ్రార్థించి, కృత

ఘ్నుఁడైన గౌతముని బ్రతికించి, వానిధనము వానికిప్పించి, యింటికిఁ బంపెను.

తే. "ఎగ్గు సేసినవారికి హితము సేఁత
యార్యజనములు కీర్తింతు రన్యదోష
కారి దనపాపమునఁ దాన కాలిపోవు
వేఱ వానికిఁ గీడు గావింపనేల?



# 7. అజామిళుఁడు

కన్యాకుబ్జము అను పురమున అజామిళుఁడు అను నొక బ్రాహ్మణుఁడు గలఁడు. అతఁడు మంచి యాచారవంతుఁడు. సమస్త శాస్త్రములఁ జదువుకొనినవాఁడు. ఒకనాఁ డాతఁడు ఫల, పుష్పముల కొఱకు నడవికి వెళ్లెను. అచ్చట నొక పొదరింటియందు నొక యువకుఁ డొక బోయదానితోఁ గ్రీడించుచుండెను. వారినిఁ జూచినతోడనే అజామిళుని హృదయము చలించెను. అతఁడు విద్య, జ్ఞానము, మర్యాద, పాపభీతి, అగ్నిసాక్షిగఁ బెండ్లాడిన భార్య మున్నగువాని నన్నిఁటిని మఱచెను.

అజామిళుఁడు ప్రపంచమంతయు మఱచి, యా వృష లిని బెండ్లాడి యడవిలోఁ గాఁపురముండెను. అతఁడు జూదము, త్రాఁగుడు ప్రారంభించి, క్రమేణ దొంగతనము, దారిదోఁపు డులయందు ననుభవజ్ఞుఁ డయ్యెను. తుంటరిగుంపులకు నాయ కుఁడై లోకులకొంపలు దోయించుచుండెను. ఇంక నెన్ని దుష్కార్యము లున్నవో వానినెల్ల నతఁడు సేయుచుండెను.

అతఁడా అంకుటాలివలనఁ బదిమంది కొడుకులఁ బడ సెను. కొంతకాలము జరుగునప్పటికి యౌవనము గడచి, ముసలితనము ప్రాప్తించెను. శరీరపాటవము తగ్గెను. శిరో జములు తెల్లనయ్యెను. దృష్టి మందగించెను. దంతము లూడిపోయెను. తల వణఁకఁ జొచ్చెను. చర్మము ముడు తలు పడెను.

అజామిళునికి ముసలితనము వచ్చినను సంసారవ్యా మోహము మాత్రము వీడలేదు. అతనికి, పదుగురు కుమా రులలో గడవాఁడగు నారాయణునియందు మిక్కిలి ప్రేమ. వాఁడీ కడ్డవానిని పై నుంచుకొని యెల్లప్పుడును ముద్దులాడు చుండెను.

అజామిళునికి మృత్యువు సమీపించెను. భయంకర స్వరూపులగు యమకింకరులు గనిపించిరి. అతఁడు సాల

భయము నందెను. కనిష్ఠకుమారుని "నారాయణా! నారాయణా!" అని చేరఁబిలిచెను. నారాయణ శబ్దము అజామిళుని నోటి నుండి రాఁగానే విష్ణుదూతలు వచ్చి, యమకింకరులఁ బాఱఁ ద్రోలిరి. యమకింకరులు వెఱఁగొంది విష్ణుదూతలతో, "అయ్యలార! మీరు విష్ణుదూతలని భావించెదము. ఈతఁడు బ్రాహ్మణుఁడైనను ద్రొక్కరాని మార్గములఁ ద్రొక్కి, చేయరాని పనులఁ జేసి, చెడిపోయెను. పేరు పాపి. ఇట్టి వానిని మీరు కరుణించుట పాడిగాదు. విముఖుఁడు, దండింపఁ గొనిపోయెదము." అని చెప్పిరి.

విష్ణుదూతలు యమదూతల యవివేకమునకు పకపక నవ్వి, యిట్లనిరి. "ఓయీ! నారాయణ యని కొడుకును పిలిచినంత మాత్రమున హరినామస్మరణ సేసినట్లగునా? యని సందేహింపకుఁడు. శ్రీ హరినామస్మరణ వలన సమస్త పాపములు నశించి, పుణ్యలోకములు గలుగును. తెలిసియైనను తెలియకయైనను శ్రీ విష్ణునామ స్మరణము జేసినవానిని బాపము లంటఁజాలవు. ఈతఁడు మరణకాలమున శ్రీహరి నామ స్మరణము గావించుటచే ధన్యుఁ డయ్యెను. కావున, నీతఁడు విష్ణుభక్తుఁడు. విష్ణుభక్తుల జోలికి మీరు రాఁదగదు." ఈ మాటలు విన్నంతనే యమదూతలు వచ్చినత్రోవన వెళ్ళిరి.

అజామీళుఁడు జరిగినదంతయుఁ జూచెను. విష్ణు దూతల సందర్శనమువలన వానికి భయము వోయెను.

జ్ఞానము గలిగెను. విష్ణుదూతలకు నమస్కరింపఁ బోయెను. వా రదృశ్యులైరి. అజామిళుఁడు పశ్చాత్తాపమంది "అయ్యో! బ్రాహ్మణుఁడనైన నేను సకలశాస్త్రములుఁ జదివి, కులాచారములను మంటిలోఁ గలిపితిని. అగ్నిసాక్షిగఁ బెండ్లాడిన భార్యను విడిచి, కలుదాగ్రుపడతిని మరగి, చెడిపోయితిని. నరకకూపమునఁ గూలబడిపోనున్న నన్ను రక్షించిన యీ మహాత్ము లెవరో! 'నారాయణా' యని పిల్లవానిఁ బిలిచి నంతమాత్రమున నాకిట్టి సద్గతి గలిగినది." అని శ్రీహరిని మనసునందు నిలిపి, గంగాతీరమున కేగి, చాలకాలము తపస్సు జేసి, శ్రీహరి సాన్నిధ్యము జేరెను.

తే. "మహితయోగోగ్ర నిత్య సమాధివిధుల
నలరు బ్రహ్మాదిసురలకు నందరాని
భూరినిర్వాణ సామ్రాజ్య భోగభాగ్య
ఖేలనంబులు హరినామ కీర్తనములు."



# 8. కపోతోపాఖ్యానము

పూర్వమొక బోయవాఁడు గలఁడు. వాఁడు పక్షులఁ జంపి, వానిలోఁ గొన్నిఁటిని దిని, మిగిలినవాని నమ్ముకొనుచు జీవించుచుండెను. ఒకనాఁడాతఁ డడవిలో వలవేసి పక్షులఁ బట్టి సాయంకాలమున కింటికిఁబోవఁ జూచుచుండెను. అంతలో గొప్ప గాలివాన వచ్చెను. అడవి యంతయు జలమయం బయ్యెను. చీఁకటులు గ్రమ్మెను. వాఁడుతడిసి వణఁకుచు, నొక మఱ్ఱిచెట్టుక్రిందఁ గూర్చుండెను.

ఆ చెట్టుతొఱ్ఱలో నొక పావురముండెను. అది తన భార్య మేతకువెళ్ళి చీఁకటిపడినను నింటికి రాలేదను చింతతో "ఎచటి కేగినదో నాభార్య! నన్ను విడిచి క్షణమైన యుండదే! ఈ పాడుగాలివాన వలన నెచ్చటనైనఁ బడిపోయినదేమో! ఇపుడేమి సేయుదును? అదిలేక యిల్లుపాడుబడి యున్నది. నా బ్రతుకిఁక నిరర్థకము. అయ్యో! ఏమి చేయుదును? నాకిఁక దిక్కెవ్వరు?" అని విలపించుచుండెను, ఆడుపావుర మచ్చటనె బోయవాని వలలోఁ జిక్కుకొని యుండెను. తనభర్త మాటలను వినెను. తనమీఁదఁ దన భర్తకుఁగల ప్రేమకెంతయు సంతసించెను. తనస్థితి భర్తకుఁ దెలిపి చింతింపవలదని పలికి, మఱియు నిట్లనియె.

"నాథా! శరణుఁజొచ్చినవాని నాదరించి, రక్షించుట పరమధర్మమని పెద్దలు సెప్పెదరు. ఈబోయ చలిచే వణఁకుచుఁ జచ్చుటకు సిద్ధముగ నున్నవాఁడు. వానికి నీచేతనైన సహాయముఁజేసి బ్రతికింపుము.

చ. "శరణము సొచ్చినం దగ
బ్రసన్నతఁ గైకొని రక్షణంబు సా
దరముగఁ జేయు టత్యధిక
ధర్మముగా బుధకోటి సెప్పు, నీ
వరసి మహార్తుఁడీని శర
ణాగతు నోపినభంగి నాపదం
బొరయక యుండఁజేయుము ప్ర
భూతపునీతునఁ గొంకు వోయెదుక."

అంతట, నా మగపావురము దుఃఖమువిడిచి బోయవానియొద్దకుఁ జేరి యాతనితో నిట్లనియె. "ఓయన్నా! నీవు మిగుల శ్రమనొంది, డస్సి యున్నవాఁడవు. ఈనాఁడు మా యింటి కతిథివైతివి. ఆలస్యముచేయక నీకోరికఁ దెలుపుము. నాచేతనైన సహాయము జేసెద." అప్పుడా బోయవాఁడు సంతసించి "చలిచే శరీరము కొయ్యయైనది. ఈయాపదఁ దొలఁగించి రక్షింపుమా!" యని వేఁడెను.

ఆ పావురము వెంటనే చిన్నిపుల్లలను ముక్కుతోఁ దెచ్చి కుప్పఁ బోసెను. అంతట సమీపగ్రామమునకుఁ బోయి నిప్పుఁదెచ్చి, మంటఁ జేసెను. బోయవానిని జలిఁగాచుకొనుమని ప్రార్థించెను. కొంతసేపటికి బోయవానికి చలిబాధతగ్గి, యాఁకలిబాధ హెచ్చెను. వాఁడాసంగతి పావురమునకుఁ దెలిపెను. 'వాని కాహారమిచ్చుటకు పక్షులయొద్దనేమి యుండును?' పాపమా కపోతమువగచి, 'నాశరీరం బాహారంబుగ నిచ్చెదఁ గొనుము' అని మండుచున్న యా నిప్పులోఁబడి చనిపోయెను.

బోయవాఁ డాశ్చర్యము నొందెను. వాఁడిట్లు తలపోసెను. "ఆహా! లోకములో నిట్టి చిత్ర మెచ్చటనైన గలదా! ఈపావుర మితరులకుగాను తన శరీర మిచ్చెను. నే నపకారముఁ జేసినను నా కుపకారముఁ జేసినది. ఇది యెంతయో పుణ్యురాలు! నే నీ జీవహింస సేయుచు దయాహీనుఁడనైన దుర్మార్గుఁడను. ఈ కపోతము నాకు గురువై మంచినీతిని బోధించినది. నేనిఁక జీవహింసఁ జేయకుందును." అతఁడట్లు నిశ్చయించుకొని వలలోఁ జిక్కుకొనియున్న పక్షులఁ విడిచి, వెళ్లిపోయెను.

వలనుండి విడువఁబడిన యాడుపావురము తనభర్త చనిపోయినందులకు మిగుల దుఃఖించి, తానును ఆ నిప్పుయందే

పడి, చనిపోయెను. శరణాగతరక్షకులగు నా పక్షిదంపతులు దివ్యవిమానములమీఁద వైకుంఠమున కేగిరి.

క. “శరణంబని వచ్చిన భీ
కర శత్రునినైనఁ బ్రీతిఁగావగ వలయున్
కరుణాపరుల తెఱంగిది
యిరవుగ సరిగావు దీని కే ధర్మంబుల్.



## 9. సావిత్రి

అశ్వపతి అను నొకరాజు మద్రదేశమును పాలించెను. సావిత్రీదేవి వరమువలన నాతనికొక కూఁతురు గలిగెను. అశ్వపతి యామెకు సావిత్రియనియే పేరిడెను. ఆమె దినదిన ప్రవర్ధమానయై సౌందర్యమునందును, సుగుణములయందును, ఆ కాలపు రాజకన్యలలోని కెల్ల మిన్నయై యుండెను. ఆమె సకల విద్యలు, శాస్త్రములు నేర్చెను. అప్పుడప్పుడామె వనములకేగి, యచ్చటి మునులను దర్శించి, సకల ధర్మములను దెలిసికొనుచుండెడిది.

సావిత్రికి వివాహమునకుఁదగిన వయస్సు వచ్చెను. అశ్వపతి యామెకుఁదగిన వరునిఁదెచ్చి, వివాహముసేయుట కాలోచించుచుండెను. ఆ కాలమున సాళ్వదేశపుప్రభువైన ద్యుమత్సేనుఁడు శత్రువులచేఁ బరాజితుఁడై భార్యాపుత్రాదులతో నడవిలో వాసము సేయుచుండెను. అతని కుమారుఁడు సత్యవంతుఁడు సౌందర్యమునందు మన్మథుని, బుద్ధియందు బృహస్పతిని మించి యుండెను. సావిత్రి మునులయొద్ద కేగినప్పుడు యాతనిఁ జూచెను. ఆమె మనస్సు ఆతనియందుఁ దగులుకొని యుండెను. కాని, సిగ్గుచే నెవ్వరికిని తెలుపలేదు.

ఒకనాఁడు నారదమునీంద్రుఁ డశ్వపతియొద్దకు వచ్చి, మాటలాడు చుండెను. ఆ సమయమున సావిత్రి మునికిని, జనకునకును నమస్కరించి తండ్రియొద్దఁ గూర్చుండెను. నారదుఁ డామెను జూచి, యౌవనవతియగు నామె కేల వివాహము సేయలేదని యశ్వపతి నడిగెను. అశ్వపతి, యా ప్రయత్నముమీఁదనే యుంటినని మునికిఁజెప్పి, పుత్రికతో "అమ్మా! నీకు వివాహసమయము వచ్చినది. నీకుఁ దగిన వరుని నీనే పేర్కొనుము. వానిని నీకుఁ బతిగాఁ జేయుదును." అని పలికెను. ఆమె యొక్కింతలజ్జించి, పిమ్మట జనకునితో, "తండ్రీ! సాళ్వరాజిప్పుడు రాజ్యముగోల్పోయి యంధుఁడై, యరణ్యమున నున్నవాఁడు. ఆతని కుమారుఁడగు సత్యవంతుఁడు గుణభూషితుఁడు. అతనినిదివరకే నేను ప్రేమించితిని." అనిపలికెను.

అశ్వపతి, సత్యవంతుని రూప, గుణాతిశయము లెట్టివో చెప్పుఁడని నారదుని బ్రార్థించెను. నారదుఁ డాతనితో, "రాజా! సత్యవంతుఁడు రూపమందును, బుద్ధియందును నిరుపమానుఁడు. అతని కతఁడే సాటి. అతఁడు నిత్యసత్యవ్రతుఁడు. అందువలననే సత్యవంతుఁ డను పేరుఁగలిగి యున్నాఁడు. కాని, యాతనికొక లోపముగలదు. పెండ్లియైన నొక సంవత్సరముననే యాతఁడు మృతినొందును." అని చెప్పెను. అశ్వపతి చింతించి, మరియొకరిని వరింపుమని కూఁతునడిగెను. కాని, సత్యవంతుఁ డెట్టివాఁడైనను తా నాతనినిదప్ప మరియొకరిని వరింపఁజాల నని సావిత్రి పలికెను.

క. "వినుము మనోవాక్కాయము
లన మూఁడు దెఱంగులందు నంతఃకరణం
బనఘ! ప్రధానము గావున
మనమునఁగైకొన్న భర్త మానందగునే?"

నారదుఁ డామె ధర్మబుద్ధి కచ్చెరువొంది, "ఈమె పట్టుదల యమోఘము. ఈమె పుణ్యముచేత భర్త దీర్ఘాయుష్మంతుఁ డగును." అని వెడలిపోయెను. ఒక శుభదినమున సావిత్రి సత్యవంతున కిచ్చి, వివాహము గావింపఁబడెను.

సావిత్రి నారచీరలు ధరించి పతికి శుశ్రూష సేయుచుండెను. ఆమె, పెండ్లియైనది మొదలు భర్తయొక్క

యాయుఃప్రమాణము లెక్కించుచుండెను. నాలుగు దినములు కొఱతగా సంవత్సరము నిండెను. నాల్గవదినమున పెనిమిటి మృతినొందునని ఆమె యెఱుఁగును. ఆమె మనస్సును భగవంతునియందు నిలిపెను. నాల్గవదినము వచ్చెను. ఆనాఁడే పతి మృతినొందును. ఆ యుదయమున సత్యవంతుఁడు కట్టెలు తెచ్చుట కడవికి వెడలెను. వలదనినకొలఁదిని నామెకూడ పతిని వెంబడించెను.

సత్యవంతుఁ డొక చెట్టును గొడ్డలితోఁగొట్టుచు శ్రమనొంది, క్రిందఁబడిపోయెను. సావిత్రి యాతురముతో నాతని శిరమును దన తొడమీఁద నుంచుకొని పరుండఁబెట్టెను. ఆ సమయమున, ఒక నల్లని భయంకరరూపము సత్యవంతుని జేరఁబోయెను. సావిత్రి పతిశిరమును మెల్లగఁ గ్రిందనుంచి, యా భయంకరరూపునకు నమస్కరించి, 'అయ్యా! మీరెవ్వరు?' అని యడిగెను. అందులకాతఁడు దాను యమధర్మరాజు ననియు, పుణ్యశీలయగుటచేఁ దానామె కగపడితి ననియుఁ జెప్పి, సత్యవంతుని ప్రాణముల బంధించి, తీసికొని పోవుచుండెను. సావిత్రి ధైర్యము వహించి పతి శరీరము నొకచోట దాఁచి, యముని వెంటఁ బరుగెత్తెను. యముఁడు సావిత్రిని రావలదని వారించెను. అప్పుడామె యాతనితో నిట్లు విన్నవించెను.

క. " పతులెందు జనిన నచటికి
సతులును జనవలదె? నీ ప్రసాదముననుఁ, మ
త్పతిభక్తి కతమునను సం
స్తుతగుణ! నాకరుగరాని చోటులుఁ గలవే?"

యముఁడామె పతిభక్తి కచ్చెరువొంది, పతిప్రాణము దప్ప వేరేదియైన నొక వరమడుగుమిచ్చెద ననెను. ఆమె తన మామ కన్నులీయుమని వేఁడెను. యముఁడా వరమిచ్చి, తనతోనిఁక రావలదనెను. ఆమె యూతనితో, 'ధర్మస్వరూపుఁడ వగు నీ శరణుఁజొచ్చితి' ననెను. యముఁడు సంతసించి, పతిప్రాణముదప్ప మరియొకవరము గోరుకొనుమనెను. తన మామకు మరల రాజ్యము వచ్చునట్టుగ ననుగ్రహింపుమని కోరెను. యముఁడింకను యామెతండ్రికి నూఱుగురు పుత్త్రులుకూడ గలుగునట్లు వరమిచ్చెను. తుదకు, నామె పతిభక్తికిని, బట్టుదలకును, ధర్మబుద్ధికిని మెచ్చి, పతిప్రాణములనుగూడ నిచ్చెను. సావిత్రీసత్యవంతు లింటికిఁ జేరిరి. సాళ్వపతి గోడలినిఁ నెన్నియోవిధములఁ బొగడెను.

క. "ఆపత్సముద్ర మగ్నం
బై పోయెడు నస్మదన్వయము పెంపెసగన్
దేపయయి కడవఁబెట్టిన
నీ పుణ్యచరిత్ర కీర్తనీయము తల్లీ.



# 10. భీష్ముఁడు

పూర్వము భారతదేశమునకు హస్తినాపురము రాజధానిపట్టణమై యుండెను. దానిని శంతనుఁడు అను చక్రవర్తి పాలించుచుండెను. శంతనుఁ డొకనాఁడు గంగానదీతీరమునఁ దిరుగాడుచుండెను. అతఁ డచ్చట భువనమోహిని యనఁ నొప్పు నొకస్త్రీని జూచెను. ఆమె సౌందర్యమున కతని మనస్సు చలించెను. ఆమెకూడ శంతనుని మోహించెను. శంతనుఁ డామెతోఁ "ఇంతీ! నీ వెవ్వరిదానవు? నీసౌందర్యము నన్నాకర్షించినది. నేను కురుదేశాధిపతిని. నన్ను వివాహమాడుము. నీ కోరికలన్నియుఁ దీర్తును." అని వచించెను. అందులకామె "నేనేమి చేసినను వారింపకుండునట్లును, నా కప్రియములు పలుకకుండునట్లును వాగ్దాన మిచ్చెదవేని నేను నీకు భార్య నయ్యెద. ఎన్నఁడైనను నేను సేయుపనులకు నడ్డు దగిలితివేని యా క్షణముననే నిన్నువిడిచి పోవుదును." అని చెప్పెను. స్త్రీ రూపధారిణియైన గంగ పలుకులకు శంతనుఁడు సమ్మతించి, యామెను భార్యగా గ్రహించెను.

కొన్నాళ్లకు, గంగ గర్భము ధరించి, యొక కుమారునిఁ గనెను. గంగ యాబిడ్డను గంగానదీజలములందుఁ బాఱవైచెను. శంతనుఁడు సూచియు 'ఇట్లేల చేసితి' వని

యడిగిన నామె లేచిపోవునేమో యను భయముతో నూర కుండెను. ఈవిధముగ నేడ్వురుబిడ్డలను నామె గంగనీటిలోఁ బాఱవేసెను. శంతనుఁ డేమియు ననలేక నూరకుండెను. గంగ యెనిమిదవ గర్భము ధరించెను. మరల నొక చక్కని కుమారుఁ డుదయించెను. ఈ బిడ్డనుఁగూడ యథాప్రకారము గంగలోఁ బడవేయుటకుఁ బోవుచుండెను. శంతనుఁ డిఁక సహింపలేక, "ఓసీ! నీవు గొడ్డాలివలె నున్నావు. కన్నబిడ్డల నిట్లు చంపుకొను తల్లులెందైనఁ గలరా? నీకిచ్చిన వాగ్దాన మనుసరించి కన్నబిడ్డలఁ జంపుచుండఁ జూచి సహించితిని. ఇఁక నే భరింపఁజాల. ఈ బిడ్డని జంపనియ్యను. అని కోప ముతోఁ బలికెను.

గంగ శంతనునితో "రాజా! నీవు గోరినట్లు ఈ బిడ్డను జంపను. కాని, నీకును నాకును సంబంధము నేఁటితో సరి. ఇన్ని దినములనుండియు నన్నెవరినిగాఁ దలఁచితివో! నేను గంగను. వసిష్ఠమహామునీంద్రుఁడు 'అష్టవసువు' లను నెని మిదిమంది దేవతలను భూమియందు జన్మించునట్లుగ శపించెను. ఆ వసువులు భూమిపైఁ జిరకాలము నిలువఁజాలక నన్ను వేఁడిరి. వారికి మేలుసేయఁగోరి నీకుఁ భార్యనై వారినిఁ గం టిని. నీటిలోఁ బాఱవేసిన యా యేడ్వురుబిడ్డలును ఏడ్వురు వసువులు. ఈయష్టమపుత్రుఁడు భూమిపైఁ బెద్దకాలము జీవిం

చును. ఈతఁడు నీ కురువంశమునకే కాక భారతభూమికంతకును గీర్తిఁ దెచ్చును. వీఁడు పెద్దవాఁడగునంతవఱకు నాయొద్దనే యుండును." అని చెప్పి కుమారునిఁ దోడ్కొనిపోయెను.

గంగాదేవి కుమారునకు దేవవ్రతుఁడు అను పేరు బెట్టెను. వసిష్ఠమహాముని యొద్ద సకలవిద్యలు, శాస్త్రములు నేర్పించెను. పిమ్మట, పరశురాముని యొద్ద విలువిద్య నేర్పించెను. దేవవ్రతుఁ డొకనాఁడు గంగానదీతీరమున విలువిద్య నభ్యసించుచు, వినోదించుచుండెను. శంతనుఁ డచ్చటికి వచ్చెను. బాలుని విలువిద్యానైపుణ్యమునకు మెచ్చుకొని 'ఈ బాలకుఁ డెవఁడా' యని విచారించుచుండెను. ఆ సమయమున గంగాదేవి ప్రత్యక్షమై "రాజా! ఈ ముద్దుబాలుఁడు నీ కుమారుఁడు. లక్షణములు దెలియుటలేదా? వీనికి దేవవ్రతుఁడని పేరు బెట్టితిని. సకల విద్యలు నేర్పించితిని. వీఁడు నీవంశము నుద్ధరించును." అని బాలుని శంతనునకు నప్పగించి, వెడలిపోయెను. శంతనుఁడు సంతోషముతోఁ గుమారునిఁ దోడ్కొని పట్టణమునకు వచ్చి, యొక శుభలగ్నమున నాతనిని యువరాజుగాఁ బట్టాభిషిక్తుని గావించెను.

ఒకనాఁడు శంతనుఁడు వేఁటకొఱకు యమునానదీతీరమునకుఁ బోయెను. అచ్చట నొక కన్యను గాంచెను. ఆమె

సౌందర్యమున కబ్బురమొంది, దానివృత్తాంత మడిగెను. తన్ను సత్యవతియని యందురనియు, బెస్తరాజైన దాశరాజునకుఁ బుత్రికననియు నామె బదులుసెప్పెను. శంతనుఁ డామెను వివాహమాడఁదలఁచి దాశరాజునొద్ద కేగి, తనకోరికఁ దెలిపెను. దాశరాజు సంతసించి శంతనునితో, "నీవంటి చక్రవర్తికి నాకొమార్తె నిచ్చుటచే నేను ధన్యుఁడ నయ్యెద. కాని, నా కూఁతువలనఁ గలిగిన కుమారుని నీ యనంతరము యువరాజుగాఁ జేసెదనని వాగ్దానమిమ్ము. అట్లుగాదేని, నాకూఁతు నియ్యఁజాల." అని పలికెను. అదివఱకే యువరాజై యున్న భీష్మునిఁ దలఁచి, శంతనుఁడు మాఱుమాటాడక వెడలిపోయెను.

శంతనుని మనస్సు సత్యవతియందే తగిలియుండి నానాఁటికి గృశించిపోవుచుండెను. తండ్రి యట్లుండుటకు దేవవ్రతుఁడు కారణము దెలిసికొని దాశరాజునొద్ద కేగి, 'నీకూఁతు నాతండ్రికిచ్చి, పరిణయము గావింపు' మని యడిగెను. అందులకు, దాశరాజు "నీతండ్రి యనంతరము నా మనుమనికే రాజ్యము లభించునెడల నట్లు చేయుదును." అని బదులిడెను. దాశరాజు నభిప్రాయము గ్రహించి దేవవ్రతుఁడు "దాశరాజా! నేను రాజ్యము స్వీకరింపను. శంతనునకు నీ తనయయందు జన్మించు కుమారుఁడే రాజు కాగలఁడు." అని పలికెను.

దాశరాజు, "దేవవ్రతా! నీవు ధర్మమూర్తివి. నీమాటఁ జెల్లింపఁగలవు. కాని, ముందు నీకుఁగలుగు పుత్రు లూరకుండఁ గలరా? అని సంశయించెదను." అనెను. అందులకు, దేవవ్రతుఁడు దాను యావజ్జీవ బ్రహ్మచర్యవ్రతము బూని యుందునని ప్రతిజ్ఞఁ జేసెను. దాశరాజు సంశయము దీరెను. ఒక శుభముహూర్తమున శంతనునకు సత్యవతి నిచ్చి, వివాహము గావించెను. భీష్మవ్రతముఁ బూనుటచే దేవవ్రతునకు భీష్ముఁడను పేరు గలిగెను.

శంతనుఁడు కుమారుని పితృభక్తికి సంతసించి యాతనికి "స్వచ్ఛందమరణము" అనఁగా నిష్టము వచ్చినప్పుడే ప్రాణములు విడుచునట్లుగ వరమిచ్చెను.

క. "పితృసంకల్పము సేయఁగ
సుతుల కవశ్యంబువలయు సుతజన్మ ఫలం
బతి ముదమునఁ బిత్రువరులకు
హితమొనరించుటయు కాదె యెంతయు భక్తిన్."



# 11. ధ్రువుఁడు

పూర్వము ఉత్తానపాదుఁడు అను రాజు గలఁడు. అతఁడు సునీతి, సురుచి అను నిరువురు భార్యలఁ బెండ్లాడెను. పెద్దభార్యవలన ధ్రువుఁడును, చిన్నభార్యవలన ఉత్తముఁడు అను కుమారులు గలిగిరి. ఇరువురు భార్యలలోఁ జిన్నభార్య యగు సురుచియందు రాజునకుఁ బ్రేమ మెండు. సర్వదా, ఆమె మేలే కోరుచు నామె సంతోషమే తన సంతోషమని తలఁచు చుండెను. సురుచియు, భర్తమనస్సు తనయందు తప్పిపోకుండునట్లతి జాగ్రత్తతో నతనికి సంతోషము గలుగఁ జేయుచు, సునీతిపై చాడీలు సెప్పుచుఁ గాలము గడపు చుండెను.

రాజు సునీతినిగాని, యామె కుమారుఁడగు ధ్రువునిఁ గాని యెన్నఁడును గన్నెత్తి చూడకుండెను. ఒకనాఁడు సురుచిమందిరమున రాజు ఉత్తమునిఁ దనతొడపైఁ గూర్చుం డఁబెట్టుకొని ముద్దాడు చుండెను. ఆ సమయమున ధ్రువుఁ డచ్చటకు వచ్చెను. తమ్మునివలె తండ్రితొడపైఁ గూర్చుం డుటకు ధ్రువున కాశ గలిగెను. రాజు చూచియు, వానిని బిలువలేదు. అయినను, ధ్రువుఁడు మురియుచు తండ్రి తొడపైఁ గూర్చుండుటకు సమీపించెను. సురుచి కోపించి,

"ఓరీ ధ్రువా! నీకు మహారాజు తొడమీఁదఁ గూర్చుండు భాగ్యములేదు. నీకట్టి యదృష్టమే యుండెనేని నా కడుపు ననే పుట్టియుందువు. నీ తండ్రితొడపైఁ గూర్చుండుటకుఁ గోరిక గలదేని భగవంతు నారాధించి నా కడుపునఁ బుట్టు నట్లు వరములొంది రమ్ము. లేదా మీయమ్మ దగ్గఱకుఁ బోయి పడియుండుము." అని నిందించెను.

ధ్రువుఁడు బాలుఁడైనను మంచి పౌరుషవంతుఁడు. సవతితల్లి కఠినవాక్యములు సహింపలేక పోయెను. సవతితల్లి మాటలకంటె తండ్రి యూరకుండెను గదా! యని దుఃఖించెను. పాపము! అతఁడేమి సేయును? ఏడ్చుచుఁ దల్లియొద్దకుఁబోయెను. సవతితల్లివలన జరిగిన పరాభవమంతయు వినిపించి, వెక్కి వెక్కి యేడ్చెను. సురుచియును మిగులఁ జింతించి, "పుత్రకా! నే నేమి సేయుదును? నీవు దుఃఖించినందువలనఁ బ్రయోజనము లేదు. మీ తండ్రి నన్ను దాసీకంటె నీచముగఁ జూచు చున్నాఁడు. నా కడుపునఁ బుట్టుటచేత నీకిట్టి పరాభవము గలిగ నది. నీ సవతితల్లి సెప్పినమాటలు వాస్తవములు. నీ యవ మానము దొలఁగింపఁదగినవాఁడు శ్రీహరియే. మా తాతయైన మనువు శ్రీహరినిఁ బూజించి యిహపరసౌఖ్యములఁ బొందెను. కావున, శ్రీహరి పాదకమలములఁ బూజింపుము. నీవును నేనును గూడ ధన్యుల మయ్యెదము.' అని కుమారునకు బోధించెను.

ధ్రువుఁడు తల్లి యాశీర్వాదము బొంది, శ్రీహరినిఁ గూర్చి తపస్సు సేయుటకుఁ బురము విడిచి, యరణ్యమునకుఁ బోవుచుండెను. అతనికి మార్గమున నారదమహామునీంద్రుఁ డెదురు పడెను. దివ్యదృష్టివలన నారదుఁ డంతయు గ్రహించి ధ్రువునితో "వత్సా! ఎవ్వరివాఁడవు? పసిబాలుఁడవు. రాచబిడ్డవలెఁ గాన్పించుచున్నావు. అట్టి నీవు సకల సౌఖ్యములను విడిచి, యీ యరణ్యమార్గమున నెచ్చట కేగెదవు?" అని యడిగెను. ధ్రువుఁడతనికి నమస్కరించి, తన పరాభవము విన్నవించి, తపము సేయబోవుచుంటి నని చెప్పెను. నారదుఁ డాశ్చర్యముతో, "బాలకా! ఆటలాడుకొనఁదగిన యీ పసి తనమున నవమానముఁ బాటింపరాదు. నీ వెక్కడ? తప మెక్కడ? మహాయోగీశ్వరులుకూడ ననేక జన్మములెత్తియు శ్రీహరిని దర్శింప లేకున్నారు. నీవు పసిబాలుఁడవు. సుకుమారుఁడవు. వనవాసము గావింపనేరవు. ప్రయోజనము లేని యీ ప్రయత్నము మాని, యింటికిఁ బొమ్ము." అని బోధించెను. ఎన్ని చెప్పినను ధ్రువునకు నచ్చక, "స్వామీ! సవతితల్లి మాటలవలన నా హృదయము కలఁగిపోవుచున్నది. నా చిత్తమున శాంతి లేదు. నీవు మహానుభావుఁడవు. నీకుఁ దెలియనిది లేదు." అని నుడివెను. ధ్రువుని పౌరుషమునకును, బట్టుదలకును నారదుఁడు సంతసించి, "కుమారా! దాపున యమునానది యున్నది. దానిచెంత మధువన మను నొక

వనము గలదు. నీ వచ్చట నివసించి, యమునయందు స్నాన మాడుచు శ్రీహరిని ధ్యానింపుము." అని దీవించి శ్రీమన్నా రాయణమంత్ర ముపదేశించెను.

ధ్రువుఁడు మధువనమును జేరి, యచ్చట మహా దీక్షతో నాఱుమాసములు ఘోరతపస్సుఁ జేసెను. అతని తపస్తీక్ష్ణమునకు లోకములు తపించెను. శ్రీమన్నారాయ ణుండు ధ్రువుని తపస్సునకు మెచ్చి, నిజరూపముతో నతని యెదుటఁ బ్రత్యక్షమయ్యెను. ధ్రువుఁడు సాష్టాంగదండప్రణా మము లాచరించి, స్తోత్రము సేయఁబోయెను. బాలుఁడై నందునఁ దెలియలేదు. దేవదేవుఁ డది యెఱింగి, తన శంఖ ముతో నతనిని స్పృశించెను. వెంటనే, ధ్రువుఁ డనేకవిధ ముల శ్రీహరిని వినుతించెను. శ్రీహరి సంతసించి, యనేక వరములిచ్చి, "వత్సా! ఇఱువదియాఱువేల యేండ్లు రాజ్య మేలి, తుదకు శాశ్వతపదవిఁ బొందఁగలవు. అని యనుగ్ర హించి, నంతర్ధానమయ్యెను.

ఉత్తానపాదుఁడు నారదునివలన ధ్రువుని తపస్సును, శ్రీహరి ప్రత్యక్షమగుటయును, బుత్రుని రాకయును నెఱింగి, యెదురేగి సగౌరవముగఁ దీసికొనివచ్చెను. తండ్రి యనవం తరము ధ్రువుఁడు చిరకాలము రాజ్యమేలిఁ తుదకు దివ్య

విమానమెక్కి బ్రహ్మాదిదేవతలకు నలవిగాని శాశ్వతలోకముఁ బొందెను.

సీ. సర్వేశ! కల్పాంతసమయమునందు నీ
యఖిల ప్రపంచంబు నాహరించి
యనయంబు శేషసహాయుండవై శేష
పర్యంకతలమునఁ బవ్వళించి
యోగనిద్రారతినుండి నాభీసింధు
జస్వర్ణలోక కంజాతగర్భ
మందుఁ జతుర్ముఖు నమరఁ బుట్టించుచు
రుచినొప్పు బ్రహ్మస్వరూపివైన

గీ. నీకు ప్రెుక్కెద నత్యంత నియమమొప్ప
భవ్యచారిత్ర! పంకజపత్రనేత్ర!
చిరశుభాకార! నిత్యలక్ష్మీవిహార!
యవ్యయానంద! గోవింద, హరి, ముకుంద!



# 12 గో, వ్యాఘ్ర సంవాదము

పూర్వమొక బ్రాహ్మణునియొద్ద నొక యావు ఉండెను. అది చాలమంచి గుణములు గలది. తోడియావులతో జగడమునకుం బోదు. పసిపిల్లలనైన నేమియు ననదు. తన యజమానునికి సమృద్ధిగఁ బాలిచ్చును. అందువలన, నది బ్రాహ్మణునిచే మిక్కిలి గారాబముగాఁ బెంపబడు చుండెను.

ఆ గోవొకనాఁ డొక వనములో మేయుచుండెను. ఒక పెద్దపులి యెక్కడనుండియో వచ్చి, దాని మీఁదకు దూఁకెను. అప్పుడా గోవు, "ఓహోహో! నిలువుము. నిలువుము. దయయుంచి నామాట యొకటి వినుము" అని అనెను. ఆ మాటలకు బులి యాశ్చర్యమొంది, "నిన్నుఁ దిని, నా యాఁకలి దీర్చుకొనఁ దలఁచితిని. నన్నెందుల కడ్డు పెట్టితివి? నీవు సెప్పెడిమాట యేమి?" అని యడిగెను. అందులకా గోవు, "అయ్యా! నాకొక కుమారుఁడు గలఁడు. వాడు పుట్టి నేఁటి కెనిమిది దినములు మాత్రమే యైనది. గడ్డిని మేయలేఁడు. నేనువోయి కడసారి వానికొక పర్యాయము కడుపారఁ బాలిచ్చి, వెంటనే వచ్చెదను. నామాట నమ్మి, నన్నుఁబోయి రమ్మని సెలవిమ్ము." అని ప్రార్థించెను.

పులి నవ్వుచు "తిలకమా! ఎంతబానవు? నన్ను మోస పుచ్చి పోవుటకు నెంచెదవు. నా పట్టునుండి వదలిన తరువాత మరల నీవు రాకేమి? నేను తెలివిమాలినదాని నని తలఁచితివి కాఁబోలు!" అని యనెను. గోవు పులితో నిట్లనెను. "ఓ వ్యాఘ్రరాజమా! నామాటల నమ్మఁజాలకున్నావు. ఇతర గోవులవలె నన్నుఁ దలఁపవలదు. నీ వనుకొనినట్లు మోసపుచ్చుట సాధులక్షణము కాదు. ఆడితప్పువాఁడు ఛండాలునితో సమానుఁడు. నన్నుఁ బోయిరమ్మని చెప్పి, పుణ్యము గట్టుకొనుము. నా లేఁదూడకుఁ గడుపారఁ బాలిచ్చి, బుజ్జగించి వెంటనే వత్తును. నీవు కాదుకూడ దంటివేని నే నేమియు సేయఁజాలను.

అట్లు బ్రతిమాలుచున్న యావునుజూచి పులి, "నీ వాడినమాట దప్పనిదానివని నమ్మకము కుదిరినది. శీఘ్రము గఁ బోయిరమ్ము" అని యనెను.

గోవు పులికిఁ బ్రదక్షిణము జేసి, సెలవొంది, చివ్వ చివ్వన యింటికిఁ బోయెను. తన బిడ్డకుఁ గడుపారఁ బాలు గుడిపెను. దూడ యెంతట, చెంగుచెంగునఁ బరుగెత్తెను. బిడ్డఁడు పరుగెత్తుచుండఁ జూచిచూచి, కనులు నీరుగ్రమ్మగా బిడ్డను బిలిచి, దానితో నావు మెల్లగ నిట్లనియె. "నాయనా!

నీ కిన్ని దినములు చన్నిచ్చి పెంచితిని. నేఁటితో మనకిద్ద రికిని ఋణము దీరినది. ఇఁక నన్నుఁ దలఁపవలదు. తండ్రీ! నాకొఱకు బెంగపడవలదు. పొలములలో నొంటరిగఁ దిరుగకుము. ప్రొద్దుపోవువఱకు మసలకుము. ఆఁబోతుల చెంతకుఁ బోకుము. గుఱ్ఱములు, నేనుగులు మొదలగునవి నడచుత్రోవలకడ్డము బోవలదు. బావులప్రక్కన నెట్టిగరిక యున్నను మేయుటకుఁ బోకుము. పాలబెంగతో నితరగోవుల పొదుఁగులకు మూతిఁ జాఁపకుము. నిన్నెవ రేమన్నను మాఱుమాటాడకుము.”

తల్లిమాటలకు బిడ్డ దీనముతో, “తల్లీ! ఈ దినమిట్టి మాటలను బలికెద వేల ? ఎందులకు నీ కన్నుల వెంబడి నీరు వచ్చుచున్నది? నీ వెక్కడకుఁ బోయెదవు? అమ్మా! నీవుపోయిన నన్నిఁక ముద్దాడు వారెవరు? నాకుఁ బాలిచ్చు వారెవరు? నీ వెక్కడకిఁ బోయెదవో నన్నును నక్కడకుఁ దీసికొనిపోరాదమ్మా!” అని యేడువసాగెను. అప్పుడా గోవు, కన్నీరుఁ గార్చుచుఁ బులితోఁ దాను జేసివచ్చిన వాగ్దానమును జెప్పెను. ఆ మాటలు విని, దూడ క్రిందఁబడి పొరలుచు, నేడువ నారంభించెను. అటుల నేడ్చియేడ్చి తల్లియొద్ద నిద్రఁ బోయెను. ఆవు, తానువచ్చి చాల సేపైనదనియు, తాను పులితోఁ జెప్పివచ్చిన సత్యవాక్యమును దలఁచియు, పుత్ర మోహమును వదలి, వెంటనే పులియొద్దకుఁ బోయెను.

గోవు రాక యాలస్యమైనందున వ్యాఘ్రము చింతించుచు "చేతికిఁ జిక్కినదానిని వదలితిని. ఇఁకనది వచ్చునా? కానిమ్ము. ఎప్పటికైన దానిఁబట్టుకొని కసి దీర్చుకొందును." అని యాలోచించుచుండ నింతలో నావు వచ్చెను. ఆవు పులితో, "ఓపుణ్యాత్ముఁడా! నీదయవలన నాబిడ్డను గడసారి చూచిరాఁగలిగితిని. నీవెంత యాఁకలితో నున్నావో! దయ చేసి నన్నిఁక భక్షించి, నన్నుఁ గృతార్థురాలిగఁ జేయుము." అని దగ్గఱకుఁ బోయెను.

గోవు సత్యవ్రతమునకుఁ బులి యాశ్చర్య మొందెను. 'నేను పుట్టిపెరిగి, యిట్టి సత్యవ్రతుల నెన్నఁడును జూడలేదు. ఇట్టిదానిఁజంపి, మహాపాతక మొడిగట్టఁ జాలను.' అని పులి తలఁచి, యావుతో, "ఓ గోరత్నమా? నీ సత్యవ్రతమునకు మెచ్చితిని. నిన్ను నేఁ జంపఁజాలను. నీవింటికిఁబోయి నీ కుమారునితో సుఖముగ నుండుము." అని చెప్పెను.

అప్పుడా గోవు, "ఓ వ్యాఘ్రరాజమా! నీ వట్లన వలదు. నా శరీరము నిదివరకే నీకు వాగ్దానము జేసితిని. నీ వాఁకలితో డస్సి యున్నావు. వెంటనే, నన్ను భక్షింపుము." అని మెడయెత్తుకొని పులిచెంతకుఁ బోయెను. పులి, దూరదూరముగఁ బోవునుగాని యావును జంపదయ్యెను. ఆవు

మాటిమాటి వేఁడిన 'వలదు, వలదు. నాకాఁకలి లేదు.' అని వెనుకకుఁ బోవును.

అప్పుడు, గోవు సత్యవ్రతమునకును, బులి దయకును భగవంతుఁడగు శ్రీ మన్నారాయణమూర్తి సంతోషించి, వానికిఁ బ్రత్యక్షమై, యా రెండింటిని తన దివ్యవిమానమున వైకుంఠమునకుఁ దీసికొని వెళ్ళెను.

చ. "నుతజల పూరితంబులగు
నూతులు నూఱిటికంటె సూనృత
వ్రత! యొక బావి మేలు, మఱి
బావులు నూఱిటికంటె నొక్క స
త్క్రతు వది మేలు, తత్క్రతు శ
తంబుకంటె సుతుండు మేలు, త
త్సుత శతకంబుకంటె నొక
సూనృతవాక్యము మేలు సూడఁగన్."



# 13. దమయంతి

పూర్వము నిషధదేశమును నలుఁడు అను మహారాజు పాలించెను. అతఁడు మిగుల ధార్మికుఁడు. పరాక్రమవంతుఁడు. పెక్కండ్రు రాజులను జయించి కీర్తిని బొందెను. అతఁడు మిక్కిలి చక్కనివాఁడు. ఆ కాలమున విదర్భదేశమును భీష్మరాజు ఏలుచుండెను. ఆతని కూఁతురు దమయంతి మిక్కిలి చక్కనిది. గొప్ప సద్గుణవంతురాలు. నలుని గుణములు దమయంతికిని, నలునికి దమయంతి గుణగణంబులును దెలియవచ్చి, యొకరినొకరు ప్రేమించిరి. తుదకొక స్వయంవరమున దమయంతి నలుని వరించి, పెండ్లాడెను.

నలునకు జూదమునం దెక్కువ ప్రీతి. పుష్కరుఁడను వానితో జూదమాడి, యావత్తు రాజ్యమును సంపదయును నోడి, యడవుల కేగుచు, నలుఁడు భార్యతో, "కోమలాంగీ!

ద్వి. "శృంగార వనములోఁ గ్రీడింపలేని
యంగన! వనిలెట్టు లటఁ జరించెదవు?
మును సౌధ సోపానముల నెక్కలేని
వనిత! యెట్లెక్కుదు వసుధాధరముల?
స్ఫటికంపు మేల్కట్లపై నెక్కలేని
కుటిలకుంతల! యెట్లు గుట్ట లెక్కెదవొ?

యరుదైన రత్నదేహాళి దాటలేని
గరిత! యేగతి దాటఁగలవు ఘట్టముల?

కావున, నాతో నీ యడవుల బాధలఁ బడజాలవు. మీ పుట్టినింటికిఁ బొమ్ము." అని వచించెను. దమయంతి యెలుఁగెత్తి యేడ్చుచు "పెనిమిటితో, "భూనాథా!

ద్వి. ఇటువంటి మాటల నిపుడాడఁ దగునె?
కటకటా! నేనెంత కడు పాపమతినో?

అరిమురి నడవి మీ రడలుచునుండ
నరనాథ! పురమున నాకుండఁ దగునె?

కలఁగి మీ రడవుల గాయాలు నమల
జెలఁగి నే నన్నంబుఁ జెయిముట్ట నగునె?

పర్ణశాలల మీరు పవళించియుండ
స్వర్ణగేహముల నే శయనింపఁ దగునె?

నగములపై మీరు నవసి వర్తింపఁ
దగిన మేడలఁ నుండదగునయ్య నాకు?

మృగములలో మీరు మెలఁగుచునుండ
మగువలలో నాకు మజియుండఁదగునె?

గిరి గృహంబుల మీరు క్రీడించుచుండ
విరుల పాన్పున నాకు విహరింపఁ దగునె?

నినుఁబాసి నిముసంబు నిలువంగఁజాల
ననుఁబాసి పోమ్మన నాయమూ నీకు?
ఎటులఁగి యెటులఁగి నన్నిటు పల్కఁదగునె?

నలుఁడామెను విడువనని యోటడించెను. ఆ రాత్రి దమయంతి నిద్రించుచుండెను. నలునకు నిదురపట్టలేదు. దమయంతి తనతోఁబాటు నాయడవుల బాధలనొంద లేదని యు, యామె నచ్చట విడిచి తానేగినచో నామె తనుఁగానక తుదకు పుట్టినింటికిఁ జేరుననియు నలుఁడు దలంచెను. అతఁడు పొంగిపొరలివచ్చు దుఃఖము నాపుకొని ధైర్యము వహించి, నిద్రించుచున్న దమయంతిని విడనాడి, తానేగెను. దమయంతి నిద్ర మేల్కాంచి పతిఁగానక యిట్లు దుఃఖించుచున్నది.:—

ద్వి. "హా రాజదేవేంద్ర! హా దయాసాంద్ర!
హా రాజమందార! హా దయాకార!

శ్రీకర ఘనమూర్తి! రిపు సమవర్తి!
నాకేశ నుతకీర్తి! నల చక్రవర్తి!

అక్కటా! యిట్టి ఘోరాటవిలోన
దక్కక ననుడించి తలఁగి పోదగునె?

ననుఁబాసి పోనని నాతోడఁ జెప్పి
పెను నిద్రపోయిన ప్రియ నన్నుడించి

కటకటా! నామీఁద గరుణఁ జాలించి
యెటులుడించిపోవ నీకేమి చేసితిని?

ఒక్కటే ప్రాణంబు నొనర నిద్దఱికి
మక్కువ లొక్కటే మనకు నిద్దఱికి

నోడకు మనుచు నన్నూఱడఁ బలికి
పాడియే! యడవిలో డించిపోవ?"

దమయంతి, యీ యడవియందు నానాకష్టములఁబడి, తుదకు చేదిదేశపు రాజధానిఁ జేరి యచ్చట నుండెను.

విదర్భదేశాధీశ్వరుండగు భీముఁడు దన కూఁతురును, నల్లుఁడును రాజ్యవిహీనులై యడవుల కేగిరని విని, మిగుల దుఃఖించి, వారిని వెదకి తెచ్చుట కనేక బ్రాహ్మణులను దేశదేశములకుఁ బంపెను. సుదేవుఁడను బ్రాహ్మణుఁడు దమయంతిని గనుఁగొని విదర్భదేశమునకుఁ దీసికొని వచ్చెను.

దమయంతికిఁ బతిసంగతి మఱవు రాకుండెను. అతఁడు మాఱువేసముతో నయోధ్యరాజునొద్ద వంటలవాఁడుగ నున్నట్లామెకుఁ దెలియవచ్చెను. ఆమె, సుదేవునితోఁ గొన్ని మాటలు జెప్పి, యయోధ్యకుఁ బంపెను. సుదేవుఁ డయోధ్య రాజసభలో, "మా రాజు దమయంతికి రెండవ స్వయంవరము

నలుపఁ దలఁచినాఁడు. మీరు వేగమే విచ్చేయుఁడు." అని చెప్పి వెడలిపోయెను. నలుఁడా మాటలు విని చాల దుఃఖించెను. అతఁ డయోధ్య దేశపు రాజుతో విదర్భ కేగెను.

దమయంతి నలుని గుర్తించి, కాళ్లమీఁదఁబడి యేడ్చి, "మిమ్ములను రావించుటకే యీ రెండవస్వయంవర మును మిష గావింపఁబడె" నని నివేదించి, క్షమింపుమని వేఁడెను. ఆ సమయమున శ్రీమన్నారాయణుండు నల దమయంతులకు ప్రత్యక్షమై, దమయంతి పతిభక్తి నలున కెఱిగించి, వారల కనేక వరము లిచ్చి, యంతర్ధాన మయ్యెను. నలుఁడు దమ యంతిని స్వీకరించి శ్రీహరి దయచే మరల రాజ్యమును బొందెను.

తే. "అనపహార్యంబు తేజోమయంబు సర్వ
గుణములకు నలంకారంబు గురుతరంబు
భామలకుఁ బతిభక్తియ పరమమైన
భూషణం బిట్టివే పెర భూషణములు."



# 14. బలిచక్రవర్తి

బలి చక్రవర్తి ప్రహ్లాదుని మనుమఁడు. అతఁడు దాన, ధర్మ క్రియాచరణ శీలుఁడు. యాగముఁ, యజ్ఞములు చేసెను. మరియు, గొప్ప బలవంతుఁడు. భూమండలమంతయు జయించెను. పిదప, దేవేంద్రునిఁ బాఱఁదోలి దేవలోకమునుగూడ స్వాధీనము జేసికొనెను. దేవతలు విష్ణుమూర్తి యొద్దకు వెళ్ళి మొఱఁ బెట్టుకొనిరి, తాను భూలోకమున జనించి, వానిఁ బరిమార్చెదనని శ్రీవిష్ణుమూర్తి దేవతల కభయ మొసఁగెను.

శ్రీహరి అదితి, కశ్యపులకుఁ గుమారుఁడై వామనరూపమున జన్మించెను. తల్లిదండ్రులు వామనుఁడనియే పేరిడిరి. బాల్యమునందె వామనుఁడు సకల విద్యాపారంగతుఁడయ్యెను.

బలిచక్రవర్తి దానధర్మములఁ జేయుటయందు లోకప్రసిద్ధి గలవాఁడు. అతనితో దానము సేయువారు మఱెవ్వరును లేరు. యాచకు లేదిగోరిన నది యిచ్చును. అతఁడొక గొప్ప యజ్ఞముఁ జేయుచు, బ్రాహ్మణుల కనేక దానధర్మములు జేయుచుండెను, ఆ సమాచారము వామనమూర్తి విని, తాను గూడ బయలుదేఱి వెళ్ళెను. వామనుఁ డచ్చటి బ్రాహ్మణు

లతో సకలశాస్త్రములఁ బఠించిన చర్చలు గావించుచుండెను. బలిచక్రవర్తి చూచి, వామనునకు నమస్కరించి, "మహాత్మా! మీ కేమి గావలయునో కోరుకొనుఁడు. తమ రాకవలన నేను సేయు నీయజ్ఞము పావనమయ్యె." అని విన్నవించెను. వామనుఁడు బలిని దీవించి, "ఓరాజా! మీ తాత ప్రహ్లాదుఁడు చాల గొప్పవాఁడు. నీవును నట్టివాఁడవే. బ్రాహ్మణులవలె యాచించుటకు నేను వచ్చినవాఁడనుగాను. నేనొంటరివాఁడను. నేను తపస్సు జేసికొనుటకు మూఁడడుగుల నేల నిచ్చినఁ జాలును." అని కోరెను. వామనుని వాక్యములకు బలి నవ్వి, "ఓయి వెఱ్ఱివాఁడా! నీవు చిన్నవాఁడవు. యాచించుట దెలియదు. కావలసిన భోగములను గోరుకొనుము." అని తెలియజేసెను. వామనుఁడు చిఱునగవుతో, "రాక్షసేంద్రా! ముక్కు మూసికొని తపస్సు జేసికొను నాకు మూఁడడుగుల నేలయే చాలును." అని చెప్పెను. వామనుఁడు గోరిన దాన మిచ్చుటకు బలి సంసిద్ధుఁడయ్యెను.

రాక్షసగురువగు శుక్రాచార్యులు బలిని సమీపించి, "రాక్షసేశ్వరా! ఇతఁడు కపటబ్రాహ్మణుఁడు. దేవతలకు మేలు సేయఁగోరి వచ్చిన శ్రీమన్నారాయణుండు దప్ప వేఱు కాదు. నిన్ను వంచించి నీ సంపదల హరింపఁదలఁచిన వాఁడు. గొప్ప శరీరుఁడై యొక పాదమున భూమియు, రెండవ పాద

మున నాకసమును నాక్రమించెనేని మూఁడవ యడుగు నెట్లి త్తువు? నెచ్చటికేగెదవు? కావున, నీ దానము మానుము. నీవు శంకింపఁ బనిలేదు. ఎట్లన

ఆ "వారిజాక్షులందు, వైవాహికములందు
ప్రాణ, విత్త, మాన భంగమందు
జకిత గో కులాగ్ర జన్మ రక్షణమందు
బొంకవచ్చు నఘము వొందదధిప."

అని బోధించెను.

బలి చక్రవర్తి శుక్రాచార్యునితో, "ఆచార్యా! ఇచ్చె దనని పలికి మరల లేదని పలుకుటకంటె పాపము మరియొకటి గలదా? మరియు,

శా. "కారే రాజులు రాజ్యముల్ గలుగవే!
గర్వోన్నతిం బొందరే!
వారేరీ! సిరి మూటఁగట్టికొని పో
వం జాలిరే! భూమిపై
బేరైనం గలదే! శిబి ప్రముఖులుం
బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు! వారలన్ మఱచిరే
యిక్కాలమున్ భార్గవా!

శా. నిరయంబైన, నిబంధమైన, ధరణీ
నిర్మూలనంబైన, దు
ర్మరణంబైనఁ, గులాంతమైన, నిజముం
రానిమ్ము, కానిమ్ము, పో !
హరియైనన్, హరుఁడైన, నీరజభవుం
డభ్యాగతుండైన, నౌఁ!
దిరుగన్ నేరదు నాదుజిహ్వ వినుమా
ధీవర్య ! చే యేటికిన్.

క. మేరువు దలక్రిందైనను,
బారావారంబు లింకఁ బాటిన లోలో,
ధారుణి రజమై పోయినఁ
ధారాధ్వము బద్ధమైనఁ దప్పక యిత్తున్."

అట్లు పలికి, బలిచక్రవర్తి వామనునికి మూఁడడుగుల నేలను శాస్త్రోక్తముగ దాన మిచ్చెను. ఎల్లరును బలిని 'బళి బళీ!' యనిరి.

వామనుఁడు బలినిఁ జూచి 'ఏదానమును భూ దానమునకు సరిఁజాలవు. అట్టి భూదాన మిచ్చినందున నుభయ లోకములఁ గీర్తిఁ బొందెదవు గాక!' అని యాశీర్వదించి తన విశ్వరూపము ధరింప మొదలిడెను. కొంచెము కొంచెముగ

పెద్దవాఁడై, మరింత పెద్దవాఁడై తుదకు, బ్రహ్మాండమంతయు నావరించెను. ఆ విశ్వరూపుఁడు భూమండలము నంతయు నొక్క పాదముతోడను, ఆకాశమంతయు నొక్క పాదము తోడను నావరించుకొని, మూఁడవ యడుగునకు స్థలముఁ జూపుమని బలి చక్రవర్తి నడిగెను. మూఁడవ యడుగునకుఁ దగిన చోటదియని, బలి తల వొగ్గెను.

శ్రీహరి యాతనిశిరముపైఁ బాదమిడి, "రాక్షసాధీశ్వరా! నీవు మిగుల పుణ్యాత్ముఁడవు. నీ పరాక్రమమునకు, సత్యనిష్ఠకు, నితరుణమునకు సంతసించితిని. పాతాళ లోకాధిపత్యము వహించి, సుఖముగ నుండుము." అని యచ్చటకు బంపివేసెను.

ఆ. "బ్రతుకఁగ వచ్చుఁగాక బహుబంధనములైన
వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక
జీవ ధనములైనఁ జెడుఁగాక పడుఁగాక
మాటఁ దిరుగలేరు మానధనులు."



# 15. శకుంతల

తొల్లి, విశ్వామిత్రుఁడు అను నొక రాజర్షి ఘోరమైన తపస్సు సేయుచుండెను. ఇంద్రుఁ డతని తపమునకు భయమొంది, మేనక అను నొక దేవకన్యను విశ్వామిత్రుని తపస్సు భంగముగావించి రమ్మని పంపెను. విశ్వామిత్రుఁడు మేనక సౌందర్యమున కచ్చెరువొంది, దానిని జేరఁదీసెను. కొంతకాలమునకు వారికొక యాఁడుశిశువు గలిగెను. ఆ శిశువు నొక యేటిగట్టునఁ బెట్టి, మేనక దేవలోకమునకుఁ బోయెను. విశ్వామిత్రుఁడును తపోభంగమునకుఁ జింతించి, యాస్థలమును విడిచి, మఱియొకస్థలమునకు బోయెను. ఆ శిశు వచ్చట దిక్కులేక యేడ్చుచుండెను. అచ్చటి పక్షులా పసిపాపను దమ ఱెక్కలతోఁ గప్పి, రక్షించుచుండెను. కణ్వుఁడు అను నొక మహర్షి యచ్చటకు వచ్చెను. అతఁడా బిడ్డను జూచి జాలిపడి, తన యాశ్రమమునకుఁ దెచ్చెను. శకుంతములచే రక్షింపఁబడిన దగుటచే శకుంతల యను పేరుఁబెట్టి మిక్కిలి ప్రేమతోఁ బెంచుచుండెను.

శకుంతల మునికన్యలతో నాడుకొనుచుఁ గాలక్రమమునఁ బెద్దదయ్యెను. ఒకనాఁడు దుష్యంతమహారాజు వేఁటనెపమున నా యడవికి వచ్చి, కణ్వాశ్రమము చెంతకుఁ జేరెను.

కణ్వమునీంద్రుని దర్శించు నుద్దేశముతో నాతఁ డాశ్రమము లోనికిఁ జనెను. కణ్వుఁడు ఫల,పుష్పముల కొఱకు వనము నకుఁ బోయి యుండెను. శకుంతల దుష్యంతుని నర్ఘ్యపాద్యాది విధులఁ బూజించెను. శకుంతల సౌందర్యమునకు రాజు మనస్సు చలించెను. అతఁడామెతో, "ఇంతీ! నీ వెవ్వరి కూఁతురవు? ఇందేల యుంటివి?" అని యడిగెను. తాను కణ్వ మహామునీంద్రుని కూఁతుర నని యామె బదులిడెను. దుష్యంతుఁ డాశ్చర్యముతో, "నారీమణీ! కణ్వమునీంద్రుఁడు శాశ్వతబ్రహ్మచారి యని వింటిని. నీ వాతని కెట్లు కూఁతుర వైతివి?" అని యడిగెను. అపుడామె తన జన్మవృత్తాంత మంతయుఁ దెలిపెను.

దుష్యంతుఁడు శకుంతలను వివాహమాడఁ గో యామెతో నిట్లనెను.

క. "ఈ వల్కలా జినములకు
నీ వన్య ఫలాశనముల కీ విటపకుటీ
రావాసములకు నుచితమె
నీ విలసిత రూప, కాంతి, నిర్మల గుణముల్."

కోమలీ! ఈ నారగుడ్డలును నడవిఫలములును, బర్ణశా లలును నీకుఁ దగవు. నన్నుఁ బెండ్లాడి, యీ మహీతలంబ

కంతకును రాణివై, సకలసౌఖ్యము లనుభవింపుము కావున, నన్నిప్పుడే గాంధర్వవిధిఁ బెండ్లాడుము.

దుష్యంతుని పలుకులు విని, శకుంతల యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

క. "కరుణానిరతులు ధర్మ
స్వరూపు లింతకు మదీయ జనకులు సనుదెం
తురు, వారువచ్చి నీకి
చ్చరేని పాణిగ్రహణము సేయుము నన్నున్."

దుష్యంతుఁడు, యామెవలన జన్మించుకుమారుని యువరాజుగాఁ జేసెదనని, శకుంతల నెట్టకేల సమ్మతింపఁజేసి, యా కోమలితోఁ గొంత సేపు సుఖించెను. పిమ్మట, కొలఁది దినములలో తన పురమునకుఁ దోడ్కొనివచ్చుటకు మంత్రులఁ బంపెద నని శకుంతల నూఱడించి, దుష్యంతుఁడు నిజపురమున కేగెను.

శకుంతల, తాను చేసినపనికి తండ్రి యేమనికోపించునో యని విచారముతో నుండెను. అంతలోఁ గణ్వుఁడు వచ్చెను. తన దివ్యదృష్టివలన జరిగినదంతయుఁ దెలిసికొని కణ్వుఁ డామెతో, "అమ్మా! భయ మొందకుము. నా యనుమతి

లేక రాజసమాగంబు గావించితినని దిగులొందకుము. అది రాచకన్యలకు ధర్మవిరుద్ధము గాదు. పౌరవంశ వర్ధనుండగు దుష్యంతుఁడు ధర్మశీలుఁడు. ఉదార స్వభావుఁడు. అతఁడు నీ పతియగుట నీ పూర్వజన్మవిశేషము. భూమండలమంతయుఁ బరిపాలింపఁగల యొక కుమారుఁడు నీ కుదయించును." అని బుజ్జగించెను. కొన్నిదినములకు, శకుంతల కొక చక్కని కుమారుఁ డుదయించెను. మునులు వానికి సర్వదమనుఁడు అను పేరు బెట్టిరి.

ఏడు సంవత్సరములు గడచెను. దుష్యంతుఁడు శకుంతల మాటయే మఱచి రాజ్యము సేయుచుండెను. ఒక నాఁడు కణ్వుఁడు శకుంతలతో, "తల్లీ! ఎట్టివారికిని పుట్టినింటఁ జాలకాల ముండుట దగదు. సతులు పతులకడనే యుండుట పరమ ధర్మము. కావున, నీపుత్త్రునిఁ దోడ్కొని, నీ భర్త పాలికిఁ బొమ్ము" అని కొందఱు శిష్యులఁదోడిచ్చి పంపెను.

శకుంతల కుమారునితో దుష్యంతుని కొలువుకూటముఁ బ్రవేశించెను. దుష్యంతుఁ డామెను జూచియుఁ, బలుక కుండెను. దీర్ఘకాలమైనందున రాజు మఱచినాఁడేమో యని శకుంతల పూర్వవృత్తాంత మంతయు దుష్యంతునకు జ్ఞప్తికిఁ దెచ్చెను. కాని, యామె యెవరో తాఁ నెఱుఁగ ననియు, ఆడఁదగనిమాటల నాడవలదనియు, వచ్చినత్రోవన నెళ్లుమనియు దుష్యంతుఁడామెతోఁ బలికెను.

శకుంతల దుఃఖముతో, "నాథా! సమస్తము నెఱిఁగియు నే నెఱుఁగనని చెప్పినంత మాత్రమునఁ దప్పిపోవునా? మన వివాహ మితరులకుఁ దెలియదని తలఁచితివా? సూర్యచంద్రులు లేరా? దిక్పాలకులు లేరా? రాజా! పుత్రవతియు, గుణవతియు నైన భార్య నవమానించినవాని కిహపరము లుండవు. వీఁడు నీ పుత్రుఁడు. పౌరవవంశ దీపకుఁడైన వీనిని గాఁగలించి యానందింపుము. ఆ నాఁటి మాటలఁ దలఁచి వానికి యువరాజ్యాభిషేకము గావింపుము.

క. నీ పుణ్యాతనువు వలనన
యీ పుత్రకుఁ డుద్భవిల్లి యెంతయు నొప్పెన్
దీపంబువలన నొండొక
దీపము ముట్టించినట్లు తేజంబెసగన్.

రాజా! ఆడినమాట దప్పకుము. నీవు ధర్మస్వరూపుఁడవు. నీకుఁ దెలియని ధర్మములు లేవు. ధర్మము లన్నిటికంటె సత్యమే యుత్కృష్టమైనది.

క. వెలయంగ నశ్వమేధం
బులు వేయును, నొక్క సత్యమును నిరుగడలం
దులనిడి తూపగ, సత్యము
వలనన మొలునూపు గౌరవంబునఁ జేర్మిన్.

మఱియు,

"క. సర్వతీర్థాభిగమనంబు
సర్వవేద సమధిగమము సత్యంబుతో సరియుఁగావ
యెఱుఁగు మెల్ల ధర్మంబుల
కెందుఁబెద్ద యండ్రు సత్యంబు, ధర్మజ్ఞులైన మునులు."

శకుంతల యనేకవిధముల దుష్యంతునకుఁ దెలియఁ జెప్పెను. దుష్యంతునికి, నామె తనభార్యయే యనియు, నాతఁడు తనపుత్రుఁడే యనియు మొదటినుండియుఁ దెలియును. కాని, యితరు లేమనుకొందురో యని భయపడి యెఱుఁగని వానివలె నటించెను. ఆ సమయమున ఆకాశవాణి యందఱకుఁ దెలియునట్లుగా, 'దుష్యంతా! శకుంతల సాధ్వీమణి. నీ ధర్మపత్ని. వాఁడు నీపుత్రుఁడు. వారలను గ్రహించి, ధర్మరక్షణము గావింపుము' అని పలికెను. దుష్యంతుఁడు నిజమంతయు సభ్యులకు వినిపించి భార్యను, బుత్రుని గ్రహించెను.

ఆ. ఎట్టి సాధ్వీకులను బుట్టిన యిండ్లను
బెద్దకాల మునికి తద్దదగదు
పతులకడన యునికి, సతులకు ధర్మువు
సతుల కేసుగడయుఁ బతులు చూవె.

—♦—

# 16. ప్రహ్లాదుఁడు

జయ, విజయులు శ్రీహరి ద్వారపాలకులు. ఒకానొక శాపకారణమున, వారు భూమియందు హిరణ్యకశిపుఁడు, హిరణ్యాక్షుఁడు అను రాక్షసులై జన్మించిరి. అందు, హిరణ్యాక్షుని శ్రీహరి వరాహరూపమై వధించెను. హిరణ్యకశిపుఁడు సోదరుని చావునకు వగచి, శ్రీహరిని సాధింపఁ దలఁచెను. శ్రీహరి యందుతావని యజ్ఞములు, యాగములు, దానధర్మములు మొదలగు సత్కార్యములను ధ్వంసము సేయించెను. వాని దుర్మార్గమునకు దేవతలు సైతము వెఱచి, యూఱకుండిరి.

హిరణ్యకశిపుఁడు, శ్రీహరిని సాధించుటకుఁ గావలసిన శక్తి, సామర్థ్యము లిమ్మని బ్రహ్మదేవునిఁగూర్చి ఘోరతపస్సు సేయ నారంభించెను. ఆ సమయమున వానిభార్య యగు లీలావతి గర్భవతిగ నుండెను. ఆమె కడుపున నెట్టి దుష్టుఁడు జనించునోయని, దేవేంద్రుఁ డామెను జంపఁదలఁచి యీడ్చుకొనిపోవు చుండెను. నారదుఁ డెదురుపడి, యామెను విడిపించి, తన యాశ్రమమునకుఁ దీసికొనిపోయెను. నారదుఁడు లీలావతీగర్భస్థుఁడగు బాలునకు భగవంతునిలీలలు మొదలగు పుణ్యకథలను బోధించెను. కొన్నిదినములకు ఒక చక్కని

కుమారుఁ డుదయించెను. ఇంతలో హిరణ్యకశిపుఁడు తపము జాలించి వచ్చెను. వాఁడు పుత్ర జననమునకు సంతసించి, బాలునికిఁ బ్రహ్లాదుఁడు అని నామకరణము సేయించెను. పూర్వజన్మసుకృతమున నా బాలుఁడు పుట్టుకతోనే హరిభక్తితత్పరుఁడై శుక్లపక్షచంద్రునివలె దిన దినాభివృద్ధి నొందుచుండెను.

ప్రహ్లాదుఁడు తల్లిదండ్రులచే నతిగారాబముతోఁ బెంపఁబడుచు నైదేండ్ల బాలుఁ డయ్యెను. బాలుఁడైనను నతని చర్యలు బహు చిత్రములుగ నుండెను. — తోడి బాలురతోఁగూడి యాడఁడు; వెఱ్ఱివానివలెఁ గనుఁబడును; పెద్దలఁ జూచినఁ జేతులుజోడించి నమస్కరించును; శ్రీహరిని బాడుచు గంతులు వేయును; ప్రతిదినమును "నారాయణా" యని పలుకుచు నిద్రనుండి లేచును; "శ్రీహరీ" యని పలుకుచు నిద్రించును.— ఈ విధమంతయు హిరణ్యకశిపుఁడు చూచి, విచారింప సాగెను.

హిరణ్యకశిపుఁడు హరిభక్తి వలదని కుమారున కనేక విధముల బోధించెను. తండ్రి వలదనిన కొలఁదిని ప్రహ్లాదుని హరిభక్తి పెరిగిపోయెను. హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని తన గురుకుమారులైన చండుడు, అమర్కుఁడు అను వారలయొద్దఁ జదువవేసెను. కొలఁదికాలములోనె ప్రహ్లాదుఁడు సకల విద్యల సారమును, గ్రహించి, సర్వము విష్ణుమయమని దలఁచెను.

ఒకనాఁడు హిరణ్యకశిపుఁడు దన కుమారునికి గురువు లేమి నేర్పిరో యని పరీక్షించుటకుఁ బ్రహ్లాదుని గురువులతో రప్పించెను. కుమారుని ముద్దాడి, తొడపైఁ గూర్చుండబెట్టు కొని, "కుమారా! నీ వేమి చదివితివి? వానిసారమును నాకుఁ దెలిపి సంతోషము గలుగఁజేయుము." అని పలికెను. ప్రహ్లాదుఁడు తండ్రికి నమస్కరించి, యిట్లు చెప్పెను. "తండ్రీ! ఈ లోకము భగవన్నిర్మితము. సకల వేదములును, శాస్త్రములును భగవంతుని లీలలను దెలుపుచున్నవి. నేనునీవు అను భేదములేక సర్వము విష్ణుమయమని శ్రీహరినామసంకీర్తనము సేయుట మంచిదని సకలవిద్యలసారముగ గ్రహించితిని" ఇదివిని హిరణ్యకశిపుఁ డులికి పడెను. ఇదియేమి వింతయని చండామర్కులు దిగులొందిరి. రాక్షసేంద్రుఁడు కుమారునితో, "తండ్రీ! సహజముగ నీకిది తోఁచెనా? ఎవరైన బోధించిరా? అని యడిగెను. ఈ లోకములో శ్రీహరిదప్ప మఱెవ్వరును దనకుఁ గన్పించుటలేదని ప్రహ్లాదుఁడు బదులుచెప్పెను.

చండామర్కులు దానవేంద్రునితో "రాజా! నీవు మాపైఁ గోపింపకుము. గట్టిశిక్షఁజేసి, వీనివెఱ్ఱి మాన్పింతుము." అని ప్రహ్లాదునిఁ దోడ్కొనిపోయిరి. మరల, కొన్ని దినములు గురువులాతనికి ననేకవిధములగు శాస్త్రములను బోధించిరి. పిమ్మట, ప్రహ్లాదుని మతి తిరిగినదని తండ్రియొద్దకుఁ దీసికొనివెళ్ళిరి. హిరణ్యకశిపుఁడు మహానందముతోఁ

కుమారుని౯ గౌఁగలించుకొని తొడమీఁదఁ గూర్చుండఁబెట్టు
కొని, "కుమారా! నీ తెలివి తేటలఁజూచి యానందింపఁ
గోరెద. ఒక పద్యము జదివి, దాని తాత్పర్యముఁ జెప్పుము."
అని యడిగెను. అందులకుఁ బ్రహ్లాదుఁడు, "తండ్రీ! సకల
విద్యలు నేర్చితిని, కాని, శ్రీహరిసేవయే శ్రేయస్కరము.
హరిభక్తిలేనివాని జీవితము నిరర్థకము. ఎట్లన

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణునాకర్ణించు వీనులు వీనులు
మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తమునిమీఁది బుద్ధి బుద్ధి

తే॥ దేవదేవుని జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి! హరిఁజేరుమనియెడి తండ్రి తండ్రి"

హిరణ్యకశిపుని హృదయమునఁ గోపాగ్ని ప్రజ్వరిల్లెను. వెంటనే, కుమారునిఁ గ్రిందఁబడఁద్రోసి, నఱుకు డని భటుల కాజ్ఞనిచ్చెను. దైత్యభటులు ప్రహ్లాదుని హరిభక్తి విడిచెదవా లేదా యని యనేకవిధముల బాధించిరి. బాధించినకొలఁది ప్రహ్లాదుఁడు శ్రీహరినామస్మరణ మధికముగఁ జేయసాగెను. హిరణ్యకశిపున కేమియు తోఁచలేదు. నిప్పులు గ్రక్కుచు, "ఓరీ! శ్రీహరియని పేర్కొనెదవు. వాడెక్కడ నున్నాఁడు. ఏరూపమున నేమి సేయుచుండును? వానిని జూపుము. నిమిషములో బరిమార్చెద." అని కుమారుని శిఖఁబట్టుకొని యీడ్చెను. శ్రీహరిని జూపుమనుట వలన ప్రహ్లాదునకుఁ బ్రహ్మానంద మాయెను. అఁతడున్నృత్యము సేయుచు,

క. "ఇందుఁ గలఁ డందు లేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలఁడు దానవాగ్రణి వింటే."

ఆ మాటలకు హిరణ్యకశిపుఁడు రోషావేశముతో "ఓరీ! నీకు మరణ మాసన్నమైనది. శ్రీహరిని నీస్తంభమునఁ జూపుము. అట్లు చూపవేని నీతల నఱకెద." అని చేతిఖడ్గముతో నా సంభమును మోఁదెను. స్తంభము ఫెళఫెళా

శావముతో బ్రద్ద లయ్యెను. శ్రీమన్నారాయణుండు నరసింహరూపమునఁ బ్రత్యక్ష మయ్యెను.

హిరణ్యకశిపునకుఁ భీతి గలిగెను. కాని, యంతలోన ధైర్యము దెచ్చుకొని గదను గిరగిరఁ ద్రిప్పుకొనుచు నరహరిపైఁ బడెను. అంత నాహరి, పురుషరూపంబును మృగరూపంబును గాని నరసింహ రూపంబున, రేయును బవలును గాని సంధ్యా సమయంబున త్రిలోక కంటకుఁడగు నా రక్కసిని క్షణమాత్ర కాలమునఁ బొట్టఁజీల్చి సంహరించెను.

దేవతలు పుష్పవృష్టి గురిపించిరి. నరసింహమూర్తి ప్రహ్లాదున కనేక వరము లిచ్చి నిజలోకమున కేగెను.

ఆ. "చక్రిచింతలేని జన్మంబు జన్మమే
తరళసలిల బుద్బుదంబు గాక
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే
పాదయుగముతోడి పశువు గాక."

